ఇంతేకాదు పూర్వము, స్థానిక పరిపాలనా సంస్థలు అయిన యూనియన్ బోర్డులు, టౌనుకమిటీలు, మ్యునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు వ్యాప[illegible]స్తున్నాయి అవినాడు అభివృద్ధికార్యక్రమాలు నిర్వహిస్తున్నాయి కాని ఆ స్థానికసంస్థల కార్యక్రమాలకు, యీ డెవలప్‌మెంటు కార్యక్రమాలకు సమగ్రంగా సంబంధం లేకుండా parallel lines లో పనిచేస్తున్నాయి [illegible] రావలెనని కూడా సూచన చేశారు

"Strengthening and improvement of the machinery of general administration"

ప్రభుత్వయంత్రాన్ని పటిష్టంచేయవలసినదిగా సూచన చేస్తూ [illegible] అభివృద్ధి కార్యక్రమాలను ప్రజాస్వామిక పద్ధతులలో నిర్వహించే విధముగా ప్లానింగ్ కమీషన్‌వారు సూచనలు చేశారు ఈ ప్రాముఖ్యాన్ని దృష్టిలో ఉంచుకొని భారతప్రభుత్వము మొట్టమొదటి ప్రణాళికా కాలంలోనే, 1952 లోనే నూతనపద్ధతిలో కమ్యూనిటీ డెవలప్‌మెంట్ కార్యక్రమాన్ని రాష్ట్రప్రభుత్వాలకు సూచించింది ఈ ఆరు సంవత్సరాలు మనము ఆ కార్యక్రమాన్ని జరుపుతూ వచ్చాము కేంద్రప్రభుత్వంలో, ప్లానింగ్ కమీషన్ క్రింద, యీ ప్లాను ప్రాజెక్టులను పరిశీలించటానికి ఏర్పాటైన కమిటీవారు ఒక చిన్న సబ్‌కమిటీని వేశారు అదే బల్వంతరాయ్ మెహతా కమిటీ బల్వంతరాయ్‌మెహతా కమిటీ 1957 వ సంవత్సరంలో ఒక రిపోర్టును భారతప్రభుత్వానికి అందజేశారు "జిల్లా పరిపాలనా వ్యవస్థను పునర్నిర్మించవలసిన అవసరము ఉన్నది, మూడు స్థాయిలలో ఒక ఎడ్మినిస్ట్రేటివ్ స్ట్రక్చర్‌ను నిర్మాణం చేయవలసి ఉన్నది" అని ఆ కమిటీ తన రిపోర్టులో సూచించింది బల్వంతరాయ్ మెహ్తా కమిటీవారి అభిప్రాయం ఏమిటంటే — గ్రామాలలో గ్రామపంచాయితీ సభ ఉండవలెను. అభివృద్ధికేంద్రంలో డెవలప్‌మెంట్ బ్లాక్ స్థాయిలో ఒక బ్లాక్ కౌన్సిల్ ఉండవలెను, జిల్లా స్థాయిలో ఒక జిల్లా కౌన్సిలు ఉండవలెను. ఈ మూడు సంస్థలు ఒకదానితో నొకటి పరస్పరసంబంధం సన్నిహితత్వం కలిగి ఉండి, కలిసిమెలిసి యీ అభివృద్ధి కార్యక్రమాలు జిల్లాలో అమలుచేయటానికి పనిచేయవలెను, ఈ మూడు సంస్థలకు పరస్పర సంబంధాన్ని ఏర్పాటుచేయవలసిన అవసరము ఉన్నది— అని వారు చెప్పారు

"Revitalise the village panchayats at the village level, statutory, elective and self-governing body called Block Council or Panchayat Samithi at block level, representative body at District level called District Council or Zilla Parishad with only advisory and supervisory functions over Panchayat Samithis."

వారి కల్పనలో, ఈవిధముగా మూడు సంస్థలు జిల్లాలో పనిచేయవలెను అని ఉన్నది దానిమీద ఆధారపడి యీ బిల్లు తయారుచేయబడింది ఈ బిల్లులో ఉన్న ముఖ్యసూత్రం ఇదే గ్రామపంచాయితీసభ, బ్లాక్ పంచాయితీ సమితి, జిల్లా పరిషత్తు -ఈమూడు సంస్థలను ఏవిధంగా నిర్మించాలి? వాటి అధికారాలు ఎమిటి ? వాటి కార్యక్రమాలు ఏమిటి ? అన్నది యీ బిల్లులో స్పష్టము చేయబడి ఉన్నది ఇదివరకుకూడ పంచాయితీలు ఉన్నవి ఒకప్పుడు తాలూకాబోర్డులు ఉండేవి తరువాత జిల్లాబోర్డులు వచ్చాయి ఈ స్థానిక సంస్థలు ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా, ప్రభుత్వయంత్రంతో సంబంధం లేకుండా, విడిగా, ఒక్కొక్కప్పుడు స్వేచ్ఛగా, కొంత అధికారం కలిగి, కలగక, శక్తిఉండి, లేక, పనిచేస్తూ వచ్చినవి ఇప్పుడు అవి పనికిరాక, వాటిని రద్దుచేసి, వాటిస్థానంలో వీటిని ఉంచటం కాదు ఈ బిల్లులోఉన్న కల్పన ఏమిటంటే— గ్రామంనుంచి జిల్లావరకు ఉన్న సంస్థలు కార్యక్రమాల నిర్వహణవిషయంలో అధికారం చెలాయించే విషయంలో, ఒకదానిమీద ఒకటి ఆధారపడుతూ, పరస్పర సంబంధం కలిగిఉంటూ, ప్రభుత్వ యంత్రంతో సంబంధం కలిగిఉంటూ యీపని చేయవలెను "సమష్టికార్యక్రమం"అనేది ఒక దృక్పథంగా పెట్టుకొని ఈబిల్లు తయారుచేయబడింది మనంఎప్పుడైతే ప్రణాళికాయుగంలో ఉన్నామో, ఎప్పుడైతే మనం దేశం ప్రణాళికల ద్వారానే అభివృద్ధి సాధించగలదనేది ఒప్పుకొన్నామో, అప్పుడు దేశంలోని ప్రతివ్యవస్థ, సంస్థ చేసే కార్యక్రమం అంతా ఒకే ధ్యేయాన్ని సాధించుటకొరకై ఉండవలెను ప్రభుత్వ యంత్రంతో పాటు అన్ని వ్యవస్థలు, అందరు, ప్రణాళికా కార్యక్రమమునే చేపట్టవలెను గాని, ప్రణాళిక బయటి కార్యక్రమం గాని, లేక, ప్రణాళికలో చెప్పిన సూత్రాలకు విరుద్ధంగా గాని పనిచేయకుండా, అందరి శక్తిని దీనికొరకే ఉపయోగించవలెను, అనే ఉద్దేశంతో యీ నిర్మాణముచేయబడుతున్నది ఈ బిల్లు యాక్టుగా తయారై, అమలులోకి వచ్చిన తర్వాత బ్లాక్ లెవెల్‌లో ఒకటే వ్యవస్థ ఉంటుంది, ఒకటే ఆర్గనైజేషన్ ఉంటుంది, ఒకే ఏజన్సీ ఉంటుంది గాని పెక్కు సంస్థలు పనిచేయటం అంటూ ఉండదు డూప్లికేటెడ్ వర్క్ అంటూ ఉండదు ప్రభుత్వ యంత్రం అభివృద్ధి కార్యక్రమాలు తలపెట్టి పనిచేయించటం స్థానిక సంస్థలు విడిగా పనిచేయటము, ప్రజాహిత సంస్థలు విడిగా పనిచేయటం— ఈ రకంగా కాకుండా ప్రజా సంస్థలు, ప్రభుత్వ యంత్రం అన్నీ కూడ ఒకే ఏజన్సీ క్రిందకు వచ్చి, ఒకే కార్యక్రమంలో జోక్యం కలిగించుకొని ఒకే ధ్యేయాన్ని చేరటంకోసం ప్రయత్నం చేయవలసిఉంటుంది ఈ బిల్లు ద్వారా సాధించబోతున్న గొప్ప విషయం ఏమిటంటే—

"An integrated programme, a single agency and avoidance of duplication, wastages and delays"

దీనిద్వారా అధికారాన్ని, డబ్బును మనం జిల్లాలకు పంచి, వారిమీద బాధ్యత ఉంచి, వారిచేత పనిచేయించటమే గాక అక్కడ బ్లాక్ స్థాయిలో సెంట్రలైజ్ చేస్తున్నామని చెబుతున్నాను ఒకవిధంగా ఇది

"A compromise or balancing between centralisation and decentralisation."

ప్రతిగ్రామాన్ని ఒక రిపబ్లిక్‌గా ఎందుకు చేయకూడదు అనేటటువంటి అభిప్రాయము పంచాయితీలకు పూర్తిగా స్వేచ్ఛనెందుకు ఇవ్వకూడదు వారి అభివృద్ధి వారే పొందే శక్తి వారికి ఎందుకు కల్పించకూడదు — అనేటటువంటి అభిప్రాయం కొందరికి ఉన్నది కాని ప్రభుత్వ అభిప్రాయం యీవిధంగా ఉన్నది ప్రతి గ్రామం ఒక రిపబ్లిక్ అయి, విడివిడిగా ఉంటే ప్రణాళికకు అవసరమైన సెంట్రల్ డైరక్షన్‌గాని, సెంట్రల్ గైడెన్స్‌గాని దొరకదు ఇవన్నీ విడివిడిగా పోవటం అన్నది తటస్థించవచ్చు గ్రామంలో ఉన్న వ్యవస్థలకు పంచాయితీలకు స్వేచ్ఛఇస్తూ, దానితోపాటు అన్నీ కలిసి ఒకే మార్గమున పోయేటట్లుగా, ఒకేధ్యేయాన్ని సాధించేటట్లుగా, ఆ అవకాశం కూడ ఏర్పాటు చేయుటకు బ్లాక్ లెవెల్‌లో సెంట్రలైజ్ చేస్తున్నాము

"Decentralisation of authority and power and devolution of revenues to zilla parishads and block samithies"

బ్లాక్ లెవెల్‌లో, ఆ బ్లాకులో ఉన్న పంచాయితీలయొక్క కార్యక్రమము సమష్టిగా జరిగేటట్లు, వారు తమ గ్రామ అభివృద్ధికొరకు ప్రయత్నించటమే కాకుండా ఆ బ్లాక్‌లో ఉన్న 60, 40 గ్రామాల యొక్క సమష్టి ఉన్నతికి కూడ పాటుపడేటట్లు, బ్లాక్ లెవెల్ లో పనిచేసే బ్లాక్ సమితినుండి వారు గైడెన్సు తీసుకొనేందుకు ఏర్పాటు చేస్తున్నాము ఒకవిధంగా బ్లాక్ లెవెల్ లో సెంట్రలైజ్ చేస్తున్నామని చెప్పవచ్చు దానిని బట్టి పంచాయితీల యొక్క స్వేచ్ఛకు భంగం కల్పిస్తున్నామని కాదు ప్రణాళికా కార్యక్రమాన్ని సాగించుట కొరకు, సమష్టి ఉన్నతికొరకు మన స్వేచ్ఛను కొంత పోగొట్టుకోవలసివస్తుంది కాబట్టి పంచాయితీలు తమ స్వేచ్ఛను కొంత తగ్గించుకొని ఆ బ్లాకులలో ఉన్న అన్ని గ్రామాల ఉన్నతి కొరకు, ఆ సమితి క్రింద పనిచేయవలసిన అవసరం కలుగవచ్చు ఇవాళ ప్రభుత్వ యంత్రంతో సంబంధం లేకుండా ప్రజలకొరకు పనిచేస్తున్న ప్రజాహిత సంస్థలు, (భారత సేవక్ సమాజ్, సోషల్ వెల్ ఫేర్ బోర్డులాంటివి) యీ బ్లాక్

సమితినుండి సలహా సహాయం పొందుతూ, బ్లాక్ సమితి యొక్క నిర్ణయాలను అమలుపర్చుటకు సహకరిస్తే బాగుంటుంది స్టేట్యుటరీ బాడీస్, డెమాక్రటిక్ ఇన్‌స్టిట్యూషన్స్, ప్రజాహిత సంస్థలు, ప్రభుత్వ యంత్రం— ఇవన్నీ కలిసి, ఒకే వ్యవస్థగా ఒకే సంస్థగా, ఒకే ఏజన్సీగా ఏర్పడి యీ కార్యక్రమాన్ని పూర్తిచేయటం యీ బిల్లు యొక్క ముఖ్య ఉద్దేశము

బల్వంతరాయ్ మెహతా కమిటీ సూచనలను నేషనల్ డెవలప్‌మెంటు కౌన్సిలుకూడ విచారించి ప్రతిరాష్ట్రంలోను అక్కడవున్న పరిస్థితులకు అనుగుణ్యంగా యీ సూచనలను అమలులోపెట్టాలని సూచించింది భారత దేశం మొత్తానికి ఒకే యూనిట్‌గా తీసుకొని, ఒకే పాట్రన్ ఇవ్వడం పనికి రాదు, ఒక రాష్ట్రంలోవున్న పరిస్థితులు మరొక రాష్ట్రంలో వుండవనే ఉద్దేశ్యంతో యీ సూచనలను అమలుచేయడంలో రాష్ట్రములకు స్వేచ్ఛ ఇవ్వ బడినది అంతేగాని సింగిల్ యూనిట్‌గా తీసుకొని ఒకే పాట్రన్ చేయమని వారు సూచించలేదు అందువల్ల వివిధ రాష్ట్రములలో వివిధ రకాలుగా యీ వ్యవహారం జరుగుతుంది జిల్లాకౌన్సిలుకు ఎక్కువ అధికారాలను కొన్నిరాష్ట్రములలో ఇస్తున్నారు కొన్నిరాష్ట్రములలో పంచాయితీ సమితులకు ఎక్కువ అధికారములు ఇవ్వడానికి ప్రయత్నాలు చేస్తున్నారు మనం, యీ బిల్లుద్వారా అధికప్రాముఖ్యాన్ని, ప్రాధాన్యతను, అధికారాన్ని పంచాయితీ సమితులకు ఇవ్వబోతున్నాము జిల్లా పరిషత్తు అనే సంస్థ వున్నప్పటికీకూడ—పంచాయితీ, పంచాయితీ సమితి, జిల్లా పరిషత్తు— యీ మూడు సంస్థలలో పంచాయితీ సమితి ఎక్కువ ప్రాముఖ్యాన్ని కలిగివుంటుంది క్రిందిలెవెల్‌లో పంచాయితీ, పైలెవెల్‌లో జిల్లా పరిషత్తు ఉంటాయి పంచాయితీ సమితి అనేది యీ రెండింటికీ ఒక లింక్‌గా పనిచేస్తుంది, వాటికంటె ఎక్కువ ప్రాముఖ్యం వహించివుంటుంది మన బిల్లును తయారుచేసేటప్పుడు యీ ఉద్దేశాన్నే ముఖ్యంగా దృష్టిలోపెట్టుకున్నాము మనదేశంలోని, ఇతర కొన్ని రాష్ట్రాలలో జిల్లా కౌన్సిలుకు ఎక్కువ అధికారాలు ఇవ్వాలని యోచన చేస్తున్నారు అటువంటి చోట్లలో పంచాయితీ సమితికి లేక, బ్లాక్ కౌన్సిలుకు ప్రాముఖ్యం లేకుండావుంటుంది ఇంకా, కొన్ని ఇతర రాష్ట్రములలో బిల్లులు తయారు కాలేదు మద్రాసు రాష్ట్రంలో డిస్ట్రిక్టు కౌన్సిలుకు, బ్లాక్ కౌన్సిలుకు విడి విడిగా రెండు బిల్లులు తెచ్చినారు ఆ రెండింటితో పోల్చి చూచినప్పుడు మన బిల్లులో కొంత ప్రత్యేకతవుంది నేను ఇప్పుడు ఆవివరాలలోనికి పోదల్చుకోలేదు

**శ్రీ ఆర్ బి రామకృష్ణరాజు** అధ్యక్షా, బ్లాక్ సమితులలో ఎం ఎల్ ఏ లు ఓటు చేయకూడదని, జిల్లా పరిషత్తులలో కలక్టరులు అధ్యక్షులుగా

ఉండాలని— యీ రెండు విషయాలే యీ బిల్లులో ముఖ్యమైనవిగా తోస్తున్నది కాబట్టి ప్రభుత్వంవారు యీ రెండు విషయాలను గురించి వారి అభిప్రాయాన్ని విపులంగా చెప్పాలని కోరుతున్నాను

శ్రీ వి బి రాజు నాకు యిచ్చిన సమయంలో సంక్షిప్తంగా యీ బిల్లులోని అన్నివిషయాలను గురించి యిచ్చిన ప్రభుత్వ ఉద్దేశాలను మనవి చేస్తాను

ప్లానింగ్ కమిషన్ చేసిన సూచనలు, బల్వంత్‌రాయ్ మెహతా టీము చేసిన సూచనలు, నేషనల్ డెవలప్‌మెంటు కౌన్సిలు తీసుకున్న నిర్ణయాలు— వీటన్నిటినీకూడ దృష్టిలో పెట్టుకొని క్రిందటి సంవత్సరం నవంబరు నెలలో స్థానిక పరిపాలనా శాఖ మంత్రిగారు యీ శాసనసభలోనే ఒక స్టేట్‌మెంటును ప్రవేశపెట్టినారు దానిని దృష్టిలో పెట్టుకొని ఆంధ్రప్రదేశ్‌లోవున్న 20 జిల్లాలలోనూ— ఒక్కొక్క జిల్లాలో, ఒక్కొక్కబ్లాకులో ఒక్కొక్కబ్లాకు సమితిని తాత్కాలికంగాస్థాపించింది ఈ బిల్లుద్వారా మొత్తం రాష్ట్రంలో బ్లాకు సమితులను ఏర్పాటుచేసి, ఆ తరువాత జిల్లా పరిషత్తులనుకూడ ఏర్పాటు చేయడం అనేది జరుగబోతున్నది ఇప్పుడు 20 జిల్లాలలోను జిల్లాబోర్డులు ఉన్నాయి ఆంధ్రప్రాంతంలో జిల్లా బోర్డులకు స్పెషల్ ఆఫీసరులు నియామకం అయినారు తెలంగాణాలో నామినేటెడ్ బోర్డులు ఉన్నాయి యీ బిల్లు శాసనం అయి అమలులోనికి వచ్చిన తరువాత అవన్నీకూడ రద్దయిపోతాయి ఆంధ్రప్రాంతంలో జిల్లాబోర్డుల స్పెషల్ ఆఫీసరులకు పొడిగించిన పదవీకాలం అయిపోవడంతోటే అవి రద్దు అయిపోతాయి తెలంగాణాలోఉన్న నామినేటెడ్ బోర్డులుకూడ రద్దుకాబడతాయి వీటితోబాటు, జిల్లా ప్లానింగ్ అండ్ డెవలప్‌మెంట్ కమిటీలుకూడ రద్దు అవుతాయి ఇక, డిస్ట్రిక్టు ఇరిగేషన్ కమిటీలు, ఎడ్యుకేషనల్ కమిటీలు మొదలైన ఇతర కమిటీలు ప్రస్తుతం ఉంటాయి వాటి సంగతి ఇంకా ఏమీ ఆలోచించలేదు జిల్లా పరిషత్తులు ఏర్పడిన తరువాత వాటి పరిస్థితి ఏమి కావాలో ఆలోచించబడుతుంది అట్లాగే, బ్లాక్ లెవెల్‌లోవున్న అడ్వైజరీ కమిటీలుకూడ రద్దుకాబడతాయి పంచాయితీలుమట్టుకు ఉంటాయి ఇప్పుడు మొత్తం మన రాష్ట్రంలోని 26 వేల గ్రామాలలో—ఆంధ్రప్రాంతములో 16,857 గ్రామాలకు సంబంధించి 9,460 పంచాయితీలు ఉన్నవి అంటే, ప్రతి ఒక్క గ్రామానికి పంచాయితీ లేదని తెలుస్తున్నది పంచాయితీ యూనిట్‌లో ఒకగ్రామంకంటె ఎక్కువ గ్రామాలు వుండవచ్చుననిమాట. రెవిన్యూ విలేజస్ 26 వేలు ఉన్నాయి కాని, పంచాయితీ యూనిట్స్ తక్కువ వున్నాయి ఆంధ్రలోవున్న 17,143 రెవిన్యూ గ్రామాలలో 16,557 గ్రామాలను

పంచాయితీలు కవర్ చేస్తున్నాయి ఆంధ్రలో చాలభాగంలో పంచాయితీ అడ్మినిస్ట్రేషన్ వున్నది తెలంగాణాలో అట్టి పరిస్థితిలేదు తెలంగాణాలో 8,327 రెవిన్యూ విలేజస్ ఉన్నాయి 1,337 రెవిన్యూ గ్రామాలలో పంచాయితీలు ఏర్పడినాయి ఆ పంచాయితిల సంఖ్య 1232 అంటే, తెలంగాణ ప్రాంతంలో పంచాయితి అడ్మినిస్ట్రేషన్ రావలసియున్నది ఇంక కొద్ది కాలంలో, తెలంగాణాలోకూడా ఎన్నికలు జరిగి ఆంధ్రలోవలెనే అన్నిగ్రామాలలోను పంచాయితీలు ఏర్పడతాయి తెలంగాణాలో టౌను కమిటీలుకూడ ఉన్నాయి వాటిని పంచాయితీలుగానే భావిస్తూ అవి యీ బ్లాకు సమితుల క్రింద వచ్చేట్లుగా యీ బిల్లులో ఏర్పాటు చేయబడ్డది తాలూకాబోర్డులు ఇదివరకే పోయినాయి జిల్లాబోర్డులు, ప్లానింగ్ కమిటీలుకూడ పోయిన తరువాత ఇకమిగిలేవి ఏమిటి అంటే మునిసిపాలిటీలు అవి యీ బిల్లుయొక్క పరిమితిలో లేవు, యీ కార్యక్రమాలలోనికి రావు కాబట్టి, స్థానిక పరిపాలనా సంస్థలలో యీ కార్యక్రమముబయట వుండిపోయేవి మునిసిపల్ కార్పొరేషనులు ఇటువంటి మునిసిపాలిటీలు ఆంధ్రలో 44, తెలంగాణలో 16 ఉన్నాయి ఇదివరకు నుంచీ అభివృద్ధి కార్యక్రమాలకొరకు జిల్లాబోర్డులు, తాలూకా బోర్డులు మొదలయినవి నిర్మాణం చేసుకుంటున్నాము ఆ పద్ధతి బ్రిటిష్‌వారి హయాంలో సిస్టమ్ ఆఫ్ డైయార్కిలో వచ్చినది యీ బిల్లు శాసనం కావడంతోటే ఆడైయార్కీ అంతమైపోతుందని మనవిచేస్తున్నాను

ప్రజల అభిప్రాయం ఏమంటే—ప్రభుత్వయంత్రంకంటె యీ స్థానిక స్వపరిపాలన యంత్రం తక్కువ, వారుచేసే పనుల స్టాండర్డ్ కూడ తక్కువ, వారి జీతాలు తక్కువ ఇప్పుడు అటువంటి విచక్షణలేకుండా, ద్వంద్వ పరిపాలనలేకుండా ఒకేపరిపాలన ఉండబోతున్నది ఎన్ని సంవత్సరాలలో యీ కార్యక్రమం పూర్తిచేయగలమో ఇప్పుడు చెప్పలేను కాని, బిల్లులోవున్న ప్రావిజన్స్ అన్నీ అమలులోనికి వచ్చేటప్పటికి ద్వంద్వ పరిపాలన అంతము అవుతుంది పరిపాలన ఎక్కడైనా ఇంకా ద్వంద్వ స్వరూపంలోవుంది అంటే అది మునిసిపల్ కార్పొరేషనులు మాత్రమే

ఇదివరకు ఎడ్‌హాక్‌గా ఏర్పడిన 20 పంచాయితీ సమితులకాలంకూడ యీ శాసనం ప్రకారం నోటిఫికేషన్ ఇవ్వగానే అయిపోతుంది ఆ తరువాత, యీ శాసనంక్రింద సక్రమంగా ఎన్నుకోబడిన పంచాయితీలు పంచాయితీ సమితులక్రిందకు వస్తాయి. మన రాష్ట్రంలో పరిపాలనా సౌకర్యం కొరకు ఇప్పుడువున్న 20 జిల్లాలు సైజు అనుకూలంగావున్నదా, లేదా అనేప్రశ్న యీ అసెంబ్లీలోకూడ అనేకమార్లు వచ్చింది మనం అభివృద్ధికార్యక్రమాలను

అమలుచేసే సందర్భంలో జిల్లాలు పెద్దవిగా వున్నాయి, విభాగం చేయాలి అనే సూచనలుకూడ వస్తున్నాయి ఈ విషయమై మద్రాసులోకూడ కొంత ప్రయత్నం జరుగుతున్నది జిల్లాలలో ఒకరికిబదులు ఇద్దరు కలెక్టరులను వేయాలనే సూచనకూడ వచ్చింది కాని. ఇప్పుడిప్పుడే ఏమీ నిర్ణయం తీసుకొనే పరిస్థితిలో లేము ఈ విషయాన్ని బాగా విచారించవలసిన అవసరం వున్నది జిల్లా పరిషత్తులు, బ్లాకు సమితులు ఏర్పాటు అయినందువల్ల జిల్లాల సైజు ఎంతవుండాలనే విషయం తేలుతుంది కాని యీ శాసనం ప్రకారం ఇప్పుడు మాత్రం 20 జిల్లాలలోను 20 పరిషత్తులు ఏర్పడతాయి

డాక్టర్ ఎ బి నాగేశ్వరరావు (రాజమండ్రి) Ad hoc పంచాయితీలు ఆరు నెలలనుండి పనిచేస్తున్నవి వాటి అనుభవాన్ని కూడా మంత్రిగారు తెలియజేయవలసినదిగా కోరుతున్నాను

శ్రీ వి బి రాజు ప్రభుత్వానికి వచ్చిన రిపోర్టులను బట్టి ఎడ్‌హాక్ పంచాయితీల నిర్మాణం శాంతియుతమైన వాతావరణంలో జరిగింది పనిలో కూడా—ప్రభుత్వ వుద్యోగులను అధికారులు అర్థంచేసుకొని మేము ఆశించిన దానికంటే ఎక్కువ సహకారాన్ని ఆయా ప్రాంతాల ప్రజాప్రతినిధులకు యిస్తున్నారు ఇంతవరకూ ప్రభుత్వానికి ఏ పంచాయితీ సమితులనుండీ complaints రాలేదు అయితే అక్కడ ఒక integrated programme తయారు కావడంలో ఆలస్యం జరిగినది కమ్యూనిటీ డెవలప్‌మెంట్ కార్యక్రమం సక్రమంగానే అమలుజరుగుతున్నది అది సక్రమంగా జరుగుతున్నదన్న ధైర్యంతోనే యిప్పుడు యీ బిల్లు తీసుకునిరావడం జరిగింది తిరిగి మా అభిప్రాయాన్ని మార్చుకోవలసిన అవసరం కలగలేదు ఎడ్‌హాక్ పంచాయితీ సమితులు స్థాపించడంలో ప్రభుత్వం మంచిపనే చేసింది అనుకుంటున్నాను వాటి అనుభవం మాకు ధైర్యాన్ని యిచ్చింది

మన రాష్ట్రంలో మొత్తం 20 జిల్లా పరిషత్తులు ఏర్పడతాయి జిల్లాకు ఒకటికన్న ఎక్కువ యిప్పుడు ఏర్పాటుచేసుకొనే అవకాశం లేదని మనవి చేశాను 20 జిల్లాలను 447 బ్లాక్సుగా విభాగం చేశాము దాదాపు 283 బ్లాక్సులో కమ్యూనిటీ డెవలప్‌మెంటు కార్యక్రమం అమలుజరుగుతున్నది మన రాష్ట్రాన్ని యీ విధంగా 447 బ్లాక్సుగా విభాగం చేయడానికి భారత ప్రభుత్వం అంగీకరించింది ఈ శాసనం అమల్లోకి వచ్చేటప్పటికి 447 బ్లాకు సమితులు ఏర్పాటు అవుతాయి. ఇప్పుడు మటుకు విభాగమైన 447 బ్లాక్సును దృష్టిలో పెట్టుకుని సమితులు ఏర్పాటుచేయడం జరుగుతుంది

శ్రీ యస్ వి కె ప్రసాద్ ఈ 447 సమితులు ఎప్పటిలోగా ఏర్పడతాయి ?

శ్రీ వి బి రాజు ఈ బిల్లు ప్యాస్ అయి, శాసనమయిన తరువాత ప్రభుత్వానికి అధికారం వస్తుంది ప్రభుత్వం నోటిఫికేషన్ ద్వారా విడివిడిగా ఒక్కొక్క బ్లాకు సమితిని ఏర్పాటు చేస్తుంది ఫలానా తారీకునుండి అన్ని బ్లాక్సులో సమితులు వస్తాయనిగాని, లేక ఫలానా తారీఖు లోపల అన్నిచోట్ల సమితులు ఏర్పాటుకావలయునని గాని లేదు ప్రభుత్వం నోటిఫికేషన్ ద్వారా విడివిడిగా ఆ సమితులను ఏర్పాటుచేస్తుంది ఎందుకంటే ప్రస్తుతం 233 బ్లాక్సు లోనే కమ్యూనిటీ డెవలప్ మెంటు కార్యక్రమం అమలుజరుగుతున్నది తక్కిన చోట్ల యీ కార్యక్రమం అమల్లో లేదు అందుచేత ఎక్కడైతే ఈ కార్యక్రమం అమల్లో లేదో అక్కడ ముందు ఏర్పాటుచేసి సమితులు ఏర్పాటు అయిన తరువాత ఒక బ్లాకులోనుండి యింకొక బ్లాకులోకి గ్రామాన్ని మార్చడం మొదలైనవన్నీ అప్పుడు జరుగుతాయి

ఈ కార్యక్రమం అన్ని బ్లాక్సులో అమలుపరచడానికి అన్నిచోట్ల అధికారవర్గం లేదు Extension Officers లేరు Village level workers లేరు ఇటువంటి చోట్ల సమితులు ఏర్పాటుచేస్తే వారికి తగినంత పని వుంటుందా లేదా అనే విషయమొకటివుంది అయితే యీ విషయంలో యింకా నిర్ణయం తీసుకోలేదు ప్రభుత్వం నిర్ణయం తరువాత తీసుకొంటుంది ఇప్పుడు మటుకు అధికారం తీసుకొంటున్నది ప్రస్తుతం అన్ని బ్లాక్సులో కార్యక్రమాల విషయంలో సమానత లేదు Staff pattern లేదుగనుక ఒక నిర్ణీతమైన తారీఖునుండి సమితులన్నీ ఏర్పాటు కావలయునంటే కొంత కష్టం అవుతుంది ప్రభుత్వం ముందు అధికారం తీసుకుంటున్నది తరువాత notification ద్వారా విడివిడిగా సమితులను ఏర్పాటు చేయబోతుంది

శ్రీ యస్ వి కె ప్రసాద్ (చెన్నూరు) అధ్యక్షా, ఎంతకాలములోపల వీటన్నింటిని ఏర్పాటు చేయవలయునని ప్రభుత్వం ఆలోచిస్తున్నది? ఆ విషయం ప్రభుత్వ దృష్టిలో నున్నదా ?

శ్రీ వి బి రాజు ఆ విషయంలో యింకా నిర్ణయం తీసుకొనలేదని మనవి చేస్తున్నాను

రాష్ట్రంలో 14, 15 వేల పంచాయితీలు వుంటాయి, వీటి వల్లనే యీ 447 సమితులు నిర్మాణం అవుతాయి ఈ 447 సమితులమీద 20 జిల్లా పరిషత్తులు నిర్మాణమవుతాయి

పునాది పటిష్టంగా లేనపుడు ఈ సమితులు గాని, పరిషత్తులు గాని సరిగా పనిచేయలేవు మన రాష్ట్రపు అభివృద్ధి భవిష్యత్తు అంతా యీ 15 వేల పంచాయితీల మీద ఆధారపడి వుంటుంది పంచాయితీలకు సంబంధించిన విషయాలు ఈ బిల్లులో ఏమీ లేకపోయినప్పటికీ— పంచాయితీలను ఆధారంగా తీసుకొని ఈ నిర్మాణం జరుగబోతున్నది అందువలన పునాదిగనుక పటిష్టంగా లేకపోతే కట్టడమే వృధా అవుతుంది ఈ శాసనం అమల్లోకి తెచ్చి, పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్తులు ఏర్పడి సక్రమంగా పనిచేస్తే చిరకాలంగా మనం కాంక్షిస్తున్న ప్రజాస్వామ్యానికి గట్టితనం ఏర్పడుతుంది రాజకీయంగా చూచినప్పటికి మనం ప్రజాస్వామ్యం యొక్క పునాదికే గట్టితనం చేకూర్చుతున్నాము ప్రజాస్వామ్యము యొక్క రక్షణ అంతా శాసనసభలు పార్లమెంటు చేతుల్లో వుంది పిరమిడ్ యొక్క పై భాగంలో మనం నేడున్నాం క్రింద ప్రజాస్వామ్యం పునాదిగావుంది దానిని రక్షించవలసిన, పోషించవలసిన అవసరం యీనాడు ఎంతయినా కనబడుచున్నది మనం పైనుండి క్రిందికి చూడబోతున్నాం అసలు base కే మనం బలం కలుగచేయబోతున్నాం రాజకీయంగా ఆలోచించినప్పటికీ— ఏ పార్టీ వారి ధ్యేయమైనా భారతదేశంలో ప్రజాస్వామ్యం ధృఢంగా, స్థిరంగా వుండాలనే ఆ ధ్యేయం ఈ కార్యక్రమం ద్వారా సాధింపబడనున్నది

ఈ బిల్లులో మొత్తం 66 క్లాజులు, 3 షెడ్యూల్సు వున్నవి మొదటి అధ్యాయంలో definition, రెండవ అధ్యాయంలో పంచాయితీ సమితుల అధికారాలు, వాటి కార్యక్రమం సూచించబడివుంది మూడవ అధ్యాయంలో జిల్లా పరిషత్తులు, వాటి అధికారాలు, కార్యక్రమాలు, నాలుగవ అధ్యాయంలో miscellaneous provisions వున్నవి

మొదటి Schedule లో పంచాయితీ సమితులు, జిల్లాపరిషత్తులు వాటి ప్రెసిడెంట్సు, వైస్-ప్రెసిడెంట్సు యొక్క కార్యక్రమాలనుగురించి చెప్పబడింది.

రెండవ Schedule లో పంచాయితీ సమితుల యొక్క అధికారాలు, వాటి కార్యక్రమాలు ఉన్నవి

మూడవ Schedule లో ప్రెసిడెంటు, వైస్-ప్రెసిడెంటు యొక్క అధికారాలు, వారియొక్క కార్యక్రమాలు ఉన్నవి ఇది చాలా చిన్న బిల్లు బహుశా Select Committee లో ఎక్కువ ఆలస్యం కాకపోవచ్చు విధాన మండలి ముందుకు, రీజియనల్ కమిటీ ముందుకు పోయినప్పుడుకూడ దీనిపై ఎక్కువ controversy వుండకపోవచ్చునని ఆశిస్తున్నాను

ఇక ఈ పంచాయితీ సమితుల నిర్మాణం ఏవిధంగా జరుగవలెను అనే విషయం ఆలోచించినపుడు direct election ద్వారా జరుగవలెనని ఒక అభిప్రాయం వుండినది Indirect election ఉత్తమ పద్ధతి అని బల్వంతరాయ్ మెహతా కమిటీవారు సూచించారు పంచాయితీ ప్రెసిడెంటుగా వున్నవారిని పంచాయితీ సమితిలో సభ్యుడుగా తీసుకొనవలెననివుంది వారికి మళ్ళ ఎన్నిక ఎందుకు పెట్టకూడదని ఒక సూచనవుంది పంచాయితీ బోర్డు సభ్యులందరు డైరెక్టు ఎలక్షను ద్వారా అధ్యక్షుని ఎన్నుకొన వలెననే సూచనవుంది ఒకవేళ అలా జరిపినట్లయితే పంచాయితీ బోర్డు అధ్యక్షునికి, పంచాయితీ సమితికి వచ్చే ప్రతినిధికి భేదాభిప్రాయాలుండవచ్చు ఈ ఎలెక్షనులో, కొట్లాటలలో వారి సమయం వృథాగా ఖర్చు అయిపోవడానికి అవకాశముంది పంచాయితీ బోర్డు అధ్యక్షుడు గనుక ప్రజలచేత ఎన్నుకొనబడితే గ్రామానికి బోర్డు కార్యక్రమాలకు సమన్వయమైన సంబంధం కుదురుతుంది గ్రామములోని ఒకవ్యక్తి ఎన్నుకోబడి సమితిలోకి వస్తే గ్రామంలోని విషయాలను దృష్టిలో పెట్టుకొని కార్యక్రమాలు నిర్వహించడానికి వీలు కలుగుతుంది పనిచురుగ్గా జరుగుతుంది పంచాయితీబోర్డు అధ్యక్షుల నందరిని పంచాయితీ సమితిలోకి ex-officio members గా తీసుకుంటే బాగుంటుందని వేరొక వుద్దేశమున్నది దీనివలన ఒక వుపయోగమున్నది ఈ పంచాయితీ సమితికి కాలపరిమితి లేకుండా శాశ్వతంగావుండే అవకాశముంది. ఎలాగంటే- పంచాయితీబోర్డు అధ్యక్షుడు సమితిలో మెంబరుగా ఉంటాడు కొత్త అధ్యక్షుడు వచ్చేవరకు అక్కడ పాత అధ్యక్షుడు వుండనేవుంటాడు పంచాయితీలకు సరియైనకాలంలో ఎన్నికలుజరగకపోయినప్పటికి తక్కిన పంచాయితీ అధ్యక్షులుదాంట్లోవుంటారు అందువలన పంచాయితీ సమితికి కాలపరిమితి అంటూలేదు పంచాయితీబోర్డు అధ్యక్షులుగా వున్నప్పుడు పంచాయితీ సమితికి సభ్యులుగా వుండవచ్చు. అందుచేత పంచాయితీ సమితికి ప్రత్యేకంగా ఎన్నికజరిపి ఏర్పాటుచేయడమంటూలేదు ఒకసారిగనుక పంచాయితీ సమితి నిర్మాణములోకి వచ్చిందంటే అది చిరకాలం వుండిపోతుంది అయితే పంచాయితీ సమితి అధ్యక్షుడుమాత్రం మూడు సంవత్సరాలకు ఒకసారి ఎన్నుకోబడాలి

వీరు అయిదుగురిని co-opt చేసుకొంటారు అందులో ఒకరిని స్త్రీల నుంచి, ఒకరిని షెడ్యూల్డు ట్రైబ్సు, షెడ్యూల్డు కేస్టుసునుంచి తీసుకోవాలి

**శ్రీమతి శాంతాబాయి (కల్వకుర్తి-జనరల్)** ఒకరికంటె ఎక్కువ ఎందుకు ఉండరాదు ?

శ్రీ వి బి రాజు ఎందుకు ఉండరాదనేది తర్వాత చర్చించుకోవచ్చు ఉన్నవిషయం చెబుతున్నాను అక్కడ అనుభవంగల వ్యక్తులు ఎవరైనా ఉంటే వారిని Co-opt చేసుకోవచ్చు కోఆపరేటివ్ సంస్థలు ఏర్పడినా ఉంటే వాటిలో నుంచి ఒకరిని దీనిలోకి Co-opt చేసుకోవచ్చు ఈ విధంగా అయిదుగురిని Co opt చేసుకొనడానికి అవకాశం ఇచ్చారు ఇంకా ఈ Blocks లోపల పంచాయతీబోర్డులు ఏర్పడని గ్రామాలనుంచి—అక్కడ అవి ఏర్పడి, వాటి అధ్యక్షుల ఎన్నికలయ్యేవరకు— ,, ముఖ్యమైన వ్యక్తిని ఇద్దరినిగాని nominate చేయవచ్చు ఈ విధంగా ex-officio, co-opted and nominated members అని మూడు రకాలుగా ఉంటారు ఈ ముగ్గురిని ప్రభుత్వం nominate చేయదు ఈ nomination కూడా అక్కడ పంచాయతీబోర్డు లేనప్పుడో లేక అది supersede చేయబడినప్పుడో జరుగుతుంటుంది గాని ఇతర విధంగా జరుగదు సామాన్యంగా ఎన్నికద్వారానో, co option ద్వారానో రావాలికాని పైనుంచి ఎవరినీకూడా నియామకం చేయబడదనే ప్రభుత్వ విధానం ప్రజలకు సంపూర్ణమైన అధికారం ఇవ్వదలచాము ఈఎన్నుకునే అధికారం కూడా వారి చేతులలోనే వదలిపెడుతున్నాము Majority వారినో లేక minority వారినో nominate చేసి పరిస్థితులను తల్లక్రిందులు చేసిందనే అపవాదుకు గురికాకుండా ఉండాలనే ప్రభుత్వంయొక్క policy ఈ విధంగా మూడురకాలుగా ఉన్న సభ్యులు 3 సంవత్సరాలకు ఒకసారి సమితి అధ్యక్షుని ఎన్నుకొంటారు ఇప్పుడు ex-officio members గా ఉన్నవారి కాలాన్ని నిర్ణయించవలసిన అవసరం ఉన్నదని మొదటనే చెప్పాను వారు ఎంత కాలం గ్రామ పంచాయతీలకు అధ్యక్షులుగా ఉంటారో, అంతకాలం ఉండటం, అది అయిపోగానే, ఇదీ అయిపోతుంది Automatic గా వెళ్ళిపోవడం జరుగుతుంది. పంచాయతీబోర్డు అధ్యక్షులందరూ కలిసి ఎన్నుకొనే 5 గురు co-opted members యొక్క కాలపరిమితి ఒక్క సంవత్సరమని చెప్పాము. ప్రభుత్వం ఉచితమని తలిస్తే ఆ time ను పొడిగించవచ్చు ఏ కారణాలవల్లనైనా రెండు సంవత్సరాలకంటె ఎక్కువ పొడిగించకూడదని దానిలో condition ఉంది ఒక సంవత్సరం ఉండాలా లేక అంతకంటె ఎక్కువ ఉండాలా అనే విషయంలో అభిప్రాయభేదాలు ఉండవచ్చు

శ్రీ ఆర్ బి రామకృష్ణరాజు ఒక సంవత్సరమని ఎందుకు పెట్టారు ?

శ్రీ వి బి రాజు Co-opt చేసుకోబడ్డవారుకాని, ప్రజలు ఎన్నుకొన్నవారుకాదు కాబట్టి ఏదైనా new blood రావాలని ప్రభుత్వం ఉద్దేశ్యం

శ్రీ కె ఎల్ నరసింహారావు (ఎల్లందు-జనరల్) వారుకూడా ఎన్నుకో బడేవారు కాదుకదా ?

శ్రీ వి బి రాజు దానిలో భేదం ఉండవచ్చు —Direct election and indirect election అని ఉండవచ్చు ఎన్నుకోవడం అంటే ప్రజలచేత ఎన్నుకో బడుతున్నారా ?

శ్రీ కె ఎల్ నరసింహారావు Co option కూడ ఒక విధమైన election అవుతుందా ?

శ్రీ వి బి రాజు ఒప్పుకొన్నాము New blood అన్నాను కాని election కాదనలేదే ! Election ద్వారానే new blood రావాలని చెప్పాను పెద్ద, పెద్ద సిద్ధాంతాలు, ఏ type of election మంచిదనే విషయం వేరే platform మీద చర్చించుకొందాము

*Term of Office* వంద గ్రామాలకు ఒక Block ఉంటుందని చెబుతున్నాము పంచాయతి యూనిట్సుగా వీటిని నిర్మించినప్పుడు 40—50 మందయినా సభ్యులు ఉంటారు వీరందరూ ప్రతిసారీ కలవడం కష్టం ప్రతి కార్యక్రమాన్ని వీరందరూ వివరంగా చర్చించడంకూడా కష్టమే అందుచేత నిత్య కార్యక్రమం ఎట్లా జరగాలి ? నిర్ణయాలు ఎట్లా తీసుకోవాలను కొన్నప్పుడు, ఈ పంచాయతీ సమితుల general bodies 3 నెలలకొకసారి కలిస్తే చాలునని ప్రభుత్వం అభిప్రాయపడింది ఈ లోపల వీటినిగురించి ఏర్పడిన Standing Committees పనిచేస్తూ ఉండాలి ఎక్కువపని Standing Committees ద్వారా జరగాలని, ఒక్కొక్క పంచాయతీసమితికి 5 Standing Committees ను వేయాలని సూచించాము అవసరమనితోస్తే ఒకటికాని, ఒకటి కన్నా ఎక్కువకాని Standing Committees ను వారు ఏర్పాటుచేసుకోవచ్చు ఉన్న కార్యక్రమమంతా ఈ five Standing Committees మధ్య విభజించడమవుతుంది ఏ సభ్యుడూ రెండు Standing Committees లో కన్నా ఎక్కువ వాటిలో సభ్యత్వం కలిగి ఉండరాదనే నిబంధన చేయబడింది ఉన్న సభ్యులందరూ ఏదో ఒక Standing Committee లో సభ్యులుగావుండి పనిచేసేటట్లు ఏర్పాటు చేయబడింది Standing Committee తీసుకొన్న నిర్ణయాలు వెంటనే అమలుకు వస్తే మంచిదనికూడా సూచించబడింది General body ముందుకు వెళ్ళి వాటి ratification and concurrence తీసుకొని అమలులోనికి రావాలంటే పుణ్యకాలం కాస్తా వెళ్ళిపోతుంది కనుక Standing Committees తీసుకొన్న నిర్ణయాలను, అక్కడ ప్రభుత్వ యంత్రాంగంలోని అధికార్లు అమలులో

పెట్టాలని యోచించబడింది ప్రతి Standing Committee లోను 7 గురు సభ్యులు ఉంటారు పంచాయతీ సమితి అధ్యక్షులు అన్ని Standing Committees లోనూ అధ్యక్షులుగా ఉంటారు ప్రతి కార్యక్రమం, ప్రతివిషయం తెలిసి ఉండాలి గనుక వారిని ఆవిధంగా ఉంచాలని అభిప్రాయపడ్డాము అవసరమనితోస్తే ఈ Standing Committees లోనికిపంచాయతీ సభ్యులుకాని వారిని ఇద్దరిని తీసుకోవచ్చునని provision చేయబడింది ఈ Standing Committees లో అవసరమనితోస్తే ఇద్దరిని బయిటివారిని తీసుకోవచ్చు లేదా అందరు సమితి సభ్యులే ఉండవచ్చు ఎవరైనా experts ఉపయోగ పడతారని సమితి భావిస్తే ఇద్దరిని బయటివారిని కూడా తీసుకోవచ్చు

శ్రీ డి నరసరయ్య (ఎల్లందు-రిజర్వుడ్) ప్రతి Standing Committee లోనూ ఏడుగురు సభ్యులుంటారని చెప్పారు దాని ప్రకారం పరిషత్ లోని సభ్యులందరూ ఈ కమిటీలలోనికి వస్తారా ?

శ్రీ వి బి రాజు · చాలా భాగం Standing Committees లోనికి వచ్చేస్తారు ఆ దృష్టితోనే 5 Standing Committees వేయబడ్డాయి అవసర మైతే 1-2 ఎక్కువ Committees ను వేసుకోవచ్చు ఈ పంచాయతీ సమితి యొక్క functions అన్నికూడా చాలా విపులంగానే ఎడ్యూలులో ఇవ్వ బడ్డాయి ఇప్పుడు పంచాయతీ సమితిద్వారా జరిగే కార్యక్రమంలో ఈభాగాలు ఉన్నాయి Community Development కార్యక్రమమంతా దీనిక్రిందకు వస్తుంది దీని కొరకు మొత్తం 5 సంవత్సరాలకు 12 లక్షలు వస్తాయి తర్వాత 5 సంవత్సరాలలో 5 లక్షలు వస్తాయి. అంటే 10 సంవత్సరాలలో రు 17 లక్షలు రాష్ట్రప్రభుత్వం కాని, కేంద్రప్రభుత్వం కాని ఈ Block కు అందచేస్తుంది ఈ మొత్తం కార్యక్రమం దానియొక్క పర్యవేక్షణక్రింద ఉంటుంది దానితోపాటు వ్యవసాయ కార్యక్రమం ఉంది. విడిగాకూడా పంచవర్ష ప్రణాళికక్రిందగాని, సామాన్యంగాకాని అభివృద్ధికొరకు జరిగే వ్యవసాయ కార్యక్రమమంతా కూడా వస్తుంది.

Animal Husbandry and fisheries, మొదలైన 15 విభాగాలు చేయ బడ్డాయి

ఈ 15 రకాల మొత్తం కార్యక్రమాన్ని బ్లాక్ సమితి చూస్తూ ఉంటుంది ఇక అక్కడ వేరే agents లేరు ఇంతవరకు ఈ 15 విభాగాలకు సంబంధించిన కార్యక్రమాన్ని ప్రభుత్వంకాని, జిల్లాబోర్డులుకాని, లేక మరో agency గాని చూస్తూ ఉండేవి ఇప్పుడు ఈ మొత్తం కార్యక్రమమంతాకూడా ఈ బ్లాక్ సమితిక్రిందే ఉంటుంది

ఈ సమితి క్రింద దాదాపు 40 మంది ఉద్యోగస్తులు పనిచేస్తారు కమ్యూనిటీ డెవలప్‌మెంటు ప్రాజక్టు క్రింద పనిచేసే ఉద్యోగస్తులు, extension officers, గ్రామసేవకులు, సేవికలు, గుమాస్తాలు, అక్కౌంటెంట్లు మొదలైన ప్రభుత్వోద్యోగులందరు దాదాపు 40 మంది ఈ సమితి క్రింద పనిచేస్తారు జిల్లా బోర్డులకు సంబంధించిన కార్యక్రమాలలోను, పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన కార్యక్రమాలలోను పనిచేస్తున్న ఉద్యోగులందరూ కూడ, మెల్ల మెల్లగా ఈ సమితి క్రిందకు వస్తారు ఈ ఉద్యోగస్తులందరిపైన ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా, బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరు ఉంటారు ఆయన కూడ ఈ సమితి క్రింద పని చేయాలని బిల్లులో సూచించబడింది

కొందరు గౌరవ సభ్యులు సమితి ఆధ్వర్యం క్రిందనా? లేక సమితిపై ఆధ్వర్యం వహిస్తారా?

శ్రీ వి బి రాజు నా opinion చెప్పడంలేదు చిత్తు బిల్లులో ఏదైతే ఉన్నదో—తెలుగులోను, ఇంగ్లీషులోను ఆ విషయాలనే చెబుతున్నాను ఈ శాసనసభ, యింకోవిధంగా అర్థంచేసుకుంటే, భాషను మార్చండి. ప్రభుత్వం యొక్క అభిప్రాయం "B D O is the executive officer of the Block Samithi He works under the Block Samithi, and not above the Block Samithi" ఈ సందర్భంలో ప్రభుత్వానికి, వేరే ఉద్దేశ్యం గాని, వేరే అభిప్రాయము కాని లేదు ఈ సమితులు ఎడ్వయిజరీ కమిటీలు కావు ఇదివరకు B D O పై ఉద్యోగస్తులు ఎట్లా చెబితే ఆ విధంగా పని చేసేవారు ఇప్పుడు ఈ బ్లాకు సమితి చెప్పినట్లు పనిచేస్తారు ఇది ప్రభుత్వం యొక్క ఉద్దేశ్యము ఈ క్లాజు వచ్చినప్పుడు, అటువంటి అర్థం స్ఫురించకుండ ఉన్నట్లయితే అక్కడ ఉన్న భాషను అవసరం అయితే సవరించవచ్చు

తరువాత బ్లాకు సమితి సభ్యులందరికి, అధ్యక్షులకు, ఉపాధ్యక్షులకు రాకపోకలకు అలవెన్సెస్ యివ్వబడతాయి ఈ బ్లాకు సమితులు నిర్వహించే కార్యక్రమాలకు ధనంకావాలికదా! ఈ ధనం, రాష్ట్రప్రభుత్వంనుంచి, కేంద్ర ప్రభుత్వంనుంచి, ఇప్పుడు జిల్లా బోర్డులకు ఉన్న సోర్సెస్‌నుంచి, ఈ సమితులకు అందజేయబడుతుంది అంతే కాకుండా ప్రజలనుంచి కూడ వచ్చే మార్గాలు ఉన్నాయి ఈ ధనాన్ని అంతా బ్లాకు సమితి ఫండుగా ఏర్పాటు చేస్తారు ఎక్కడెక్కడనుంచి వచ్చినప్పటికి ఆ ధనాన్నంతా ఈ నిధికి చేరుస్తారు ఈ సమితులు చేయవలసిన ఖర్చు నంతా, ఈ నిధినుంచే ఖర్చుపెడతారు ప్రతి సంవత్సరం lapse కావడంఅంటూ ఈ నిధికి ఉండదు. అంతేగాక క్రొత్తగా sanction చేయాలి అనే సమస్యకూడ ఉద్భవించదు ఏమైన మిగులు ఉన్న

ట్లయితే, ఆ మిగులు మొత్తం ఆ బ్లాకు సమితికే ఉంటుంది ఈ బ్లాకు సమితు లకు, పంచాయతీలమీద సూపర్ విజను చేసే అధికారంకూడ ఉన్నది ఈ పంచాయితీల యొక్క బడ్జెట్టు పంచాయితీ అధ్యక్షుల సూచనలతో, బ్లాకు డెవలప్ మెంటు ఆఫీసరుదగ్గరకు వస్తుంది ఈ బ్లాకు సమితులు సరిగా పని చేయకపోయినట్లయితే, దానిని సూపర్ సీడ్ చేసే అధికారం ప్రభుత్వానికి మాత్రమే ఉన్నది ఈ బ్లాకు పరిధియాలనుండి ఎన్నికైనటువంటి M L A, M L C లు ఓటులేని సభ్యులుగా ఈ బ్లాకు సమితిలలో ఉంటారు వీరు అన్ని చర్చలలో పాల్గొనవచ్చు సలహాలు యివ్వవచ్చు కాని ఓటుచేసే అధికారం మాత్రం కలిగిఉండరు (హర్షము)

ఒక గౌరవ సభ్యుడు ఓటు లేకపోవడానికి కారణం ఏమిటి? అందు కోసమని ఎన్నుకోబడనందుకా?

శ్రీ వి బి రాజు ఓటుచేసే అధికారం కలిగిఉండాలంటే పంచాయితీ అధ్యక్షులుగా ఎన్నిక కావాలి

శ్రీ ఆర్ బి రామకృష్ణరాజు కో-ఆప్టు చేసుకోవచ్చునుగదా!

శ్రీ వి బి రాజు కో ఆప్టు చేసుకోవడం మంచిదికాదు ఎందుచేతనంటే శాసనసభ్యులు సలహాయిచ్చే పెద్దమనుష్యులుగా ఉంటారు అక్కడ ఉన్న సభ్యులకన్న ఆధిక్యత వారికిచ్చాము, ఆ చిక్కులలో తలదూర్చకుండా, వారికి సలహాలు యివ్వడానికి వీలుగా ఉంటారనే ఉద్దేశ్యంతో ఓటుహక్కు యివ్వలేదు

శ్రీ ఆర్ బి రామకృష్ణరాజు అంటే నోరులేని సభ్యులు

శ్రీ వి బి రాజు నోరు ఉన్నది ఓటులేని సభ్యులు

శ్రీ డి నరసయ్య ఆ విధంగా ఓటుహక్కు యివ్వకుండా ఉండడానికి కారణం?

శ్రీ వి బి రాజు ఓటుహక్కు కావాలంటే పంచాయితీ అధ్యక్షులుగా ఎన్నిక కావలసి ఉన్నది శాసనసభ్యులను, పంచాయతీ అధ్యక్షులను సమానంగా చూడకుండా, అంతకంటె ఎక్కువ గౌరవంతో చూడాలనే ఉద్దేశ్యంతోనే, ఈ విధంగా చేశామని మనవి చేశాను.

శ్రీ బి వి శివయ్య (మారూరు) కో-ఆప్షన్ గురించి Act లో చేరుస్తే బాగుంటుందేమో?

శ్రీ వి బి. రాజు ఆ క్లాజు వచ్చినప్పుడు చూడవచ్చును ఎందునుగురించి ఓటుహక్కు యివ్వలేదు అనేదానిని గురించి మనవిచేశాను అందులో ప్రభు

త్వానికి వేరే ఉద్దేశ్యం ఏమీలేదు అసెంబ్లీ సభ్యుడుగా ఎన్నికై, బ్లాకు సమితికి అధ్యక్షుడుగా లేక సభ్యుడుగా కూడ ఎన్నికైనట్లయితే, ఆ బ్లాకుల గురించి ఏవైన విమర్శలు అసెంబ్లీలో వచ్చినట్లయితే అటువంటి విమర్శలనుంచి దూరంగా ఉంచాలనే ఉద్దేశ్యంతోనే చేశాము M L A లు పెద్దమనుష్యులుగా సలహాలు యిచ్చేవారుగా మాత్రమే ఉంటే బాగుంటుందని ఆవిధంగా చేయబడింది

శ్రీ యం నాగిరెడ్డి (మాచెర్ల) M L A లే పెద్దమనుష్యులా ? మిగతావారు కారా ? (హర్షము)

శ్రీ వి బి రాజు అటువంటి అభిప్రాయం నేను వ్యక్తపరచలేదు ఏ తగాదాలోను చేరకుండా, అందరికీకూడ మంచి సలహాలు యిచ్చేవారిని పెద్దమనుష్యులు అంటారు ఆ రీతిగా M L A లు ఉంటారని అన్నాను

తరువాత జిల్లాపరిషత్తుల నిర్మాణంలో ఈ బ్లాకు సమితుల అధ్యక్షులందరు ఇందులో సభ్యులుగా ఉంటారు అంతేగాక జిల్లాలో ఉండే శాసనసభ, శాసన మండలి సభ్యులు, ఆ జిల్లాలోని పార్లమెంటు, రాజ్యసభ సభ్యులు, అందులో సభ్యులుగా ఉంటారు. ఈ జిల్లా పరిషత్తులో ఛైర్మన్ ఎన్నికలేదు జిల్లా కలెక్టర్ ఛైర్మన్‌గా ఉంటారు వైస్-ఛైర్మన్ ఎన్నిక ఉంటుంది ఈ ఎన్నిక అనధికారులనుంచే జరుగుతుంది ఇక్కడ Standing Committeeలు ఉంటాయి ఈ వైస్-ఛైర్మనే ఈ Standing Committee ల మీద ప్రిసైడింగు అథారటీ ! బ్లాకు సమితులలో ప్రిసైడింగు అథారటీ బ్లాకు సమితి అధ్యక్షులు, జిల్లా పరిషత్తులలో వైస్-ఛైర్మన్ ఈ యిద్దరుకూడ అనధికారులే కలెక్టరుగారు మాత్రం జనరల్ బాడీ సమావేశానికి ఛైర్‌మన్‌గా ప్రిసైడ్ చేస్తారు

అసలు కలెక్టరును ఇంతవరకు టాక్సులు వసూలు చేసేవారుగానే మనం భావిస్తున్నాము The word Collector it self, collection of taxes అనే అర్థం యిస్తు వచ్చాము

శ్రీ బి ఎల్లారెడ్డి (బుగ్గారం) ఇక్కడ కలెక్టరుహోదా, గవర్నరుగారి హోదాలాంటిదా ?

శ్రీ వి బి రాజు మొట్టమొదట కలెక్టరు, collection of taxes and land revenue inchargeగాఉండేవారు తరువాత డిస్ట్రిక్టుమేజస్ట్రేటుఅన్నారు ఆ తరువాత జ్యుడిషియరీని సెపరేటు చేశారు ఇప్పుడు ఈ Welfare State లో ఒక్క taxes వసూలు చేయడం, ప్రజారక్షణే కాకుండా, అభివృద్ధి కార్యక్రమాలను కూడా వారికే ఎందుకు అప్పజెప్పకూడదు అనే విషయం ఆలో

చించి, ఈవిధంగా చేశాము ఈవిధంగా చేసినట్లయితే, అధికారులను, అనధికారులను సమ్మిళితముచేసి ప్రజాహితకార్యాల అభివృద్ధికి పాటుపడవచ్చునని ప్రభుత్వ ఉద్దేశ్యం ఈ స్థానికసంస్థలను, ప్రభుత్వ యంత్రాంగానికి parallel గా మనం నిర్మాణం చేయబోవడంలేదు ఈ ముఖ్యసూత్రాన్ని మనం దృష్టిలో పెట్టుకొంటే, దీనిని సులభంగా అర్థంచేసుకోవచ్చు అటు అధికార్లను ఇటు ప్రజాసంస్థలను ఏకంచేయవలసిన అవసరం ఈరోజున ప్రధానంగా కనపడుతోంది ప్రభుత్వ యంత్రాంగానికి ప్రజాసంస్థలకు సన్నిహిత సంబంధము చాలా అవసరం, ఆ ఉద్దేశ్యంతోనే ఈ బిల్లు తేబడింది ఈరోజున ఏ గ్రామపంచాయితీ అధ్యక్షుని యొక్క అధికారాలను మనం ఎక్కువ చేయబోతున్నామో, ఆ పంచాయతీ అధ్యక్షుడు అనధికారి అని సభ్యుల గుర్తుకు తెస్తున్నాను అదే విధముగా బ్లాకు సమితి అధ్యక్షులుకూడ అనధికారే! రాష్ట్రప్రభుత్వంయొక్క అధినేతకూడ ఈరోజున అనధికారే అని మనవిచేస్తున్నాను అందుచేత ఒక కలెక్టరు ఉన్నంతమాత్రాన ఏవిధమైన భయంలేదని, అవిధంగా అధికార్లు, అనధికార్లు కలిసి పనిచేస్తే అభివృద్ధి సాధించడానికి ఎక్కువ అవకాశాలు ఉంటవనే ఉద్దేశ్యంతోనే చేయబడింది కలెక్టరు జనరల్‌బాడీ సమావేశానికి అధ్యక్షత వహిస్తారు Standing Committee లకు ఎక్కువ అధికారాలు ఇవ్వబడినాయి ఆ కమిటీలమీద అధ్యక్షతవహించేవారు కూడ అనధికారులే! కాబట్టి ప్రభుత్వ యంత్రాంగంయొక్క సహకారం సంపూర్ణంగా, ప్రజాసంస్థలకు అందజేయాలనే ఇందులోనికి కలక్టరును తీసికొనిరావడం జరిగిందని మరొకసారి మనవిచేస్తున్నాను

ఇక్కడ Cabinet system వున్నది This Cabinet is responsible to the Legislature అక్కడ Cabinet system కాదు. అవన్నీ Assemblies కావు. వాటికి legislature అధికారాలు లేవు Welfare State లో ప్రభుత్వ కార్యక్రమము ఏదైతె వుందో ఆ కార్యక్రమాన్ని బాగుగా అమలు జరుపడానికి ప్రజల సంపూర్ణ సహకారము సంపాదించేందుకు ప్రభుత్వ అధికారులు ప్రజల ప్రతినిధులు కలసి పనిచేసేందుకు ఆ వ్యవస్థను నిర్మిస్తున్నాము కాని ప్రభుత్వ యంత్రానికి parallel గా దానిని నిర్మించడములేదు. ఈ విషయం దృష్టిలో పెట్టుకొనమని నేను మనవిచేస్తున్నాను

ఒక గౌరవ సభ్యుడు Standing Committee యొక్క నిర్ణయాలు తుది నిర్ణయాలుగా స్వీకరింపబడుతవా ?

శ్రీ కె వెంకటరావు ఇప్పుడు కలెక్టర్ అనే అధికారి అక్కడ అధికారంలోవుండడమువల్ల యీ కార్యక్రమమును తొందరగా విజయవంతము

చేయగలము ఈ విషయం ఆలోచించకుండా కలెక్టర్ పెద్దా? లేక non-official పెద్దా? ఎవరు కుర్చీమీదకూర్చుంటే బాగుంటుంది? అనే విషయాల గురించి ఆలోచిస్తే అసలు కార్యక్రమం నడువదు

శ్రీ బి ఎల్లారెడ్డి Executive powers ప్రెసిడెంటుకు వుంటాయా, లేక వైస్-ప్రెసిడెంటుకు వుంటాయా?

శ్రీ వి బి రాజు అసలు powers సమితికి జిల్లా పరిషత్తుకి వుంటాయి ఈ వేళ powers అనేవి వ్యక్తులకు కాదు అనే దానిని కూడా మనము దృష్టిలో పెట్టుకోవాలి ఎవరు వ్యవహరించినా సమితి నిర్ణయాలకు లోనై వ్యవహరించాలి, ఈ వేళ జిల్లా పరిషత్తులకైనా లేక పంచాయితీ సమితులకైనా సంపూర్ణ అధికారాలు ఇస్తున్నాము వారు చేసే నిర్ణయాలు యీ శాసనానికి, ప్రజాహితానికి విరుద్ధంగా లేకపోయినట్లయితే జోక్యము కల్గించుకొనే అధికారము ఎవరికి లేదు కాని పంచాయితీ సమితికి అధికారముండవలెనా? లేక పంచాయితీ సమితికి సంబంధములేకుండా వ్యక్తి అయిన అధ్యక్షునికి అధికారాలు యివ్వవలెనా? అన్నప్పుడు సమితికి ఎక్కువ అధికారాలు వుండవలెననియే ప్రభుత్వ అభిప్రాయము Block Development Officer అయినా లేక పంచాయితీ సమితి అధ్యక్షులైనా ఎవరైనాసరే సమితి నిర్ణయాలకులోనై వ్యవహరించాలి ఇక day to-day functions లో వారి నిర్ణయాలను అమలులోనికి తీసికొచ్చే అంతవరకే వారి అధికారాలు వుండాలి ఉదాహరణకు Block Development Officer ను తీసుకోండి ఇంతవరకూ ఇక ముందు కూడ అతనిపైన అధికారులున్నారు

It is a matter of detail and we have got to examine the details.

బ్లాకు సమితి అధ్యక్షుడు Block Development Officer మీద ఏమి అధికారముకలిగి వుంటాడని ప్రశ్నవేసినపుడు బ్లాక్ సమితిచేసిన నిర్ణయాలనన్నింటిని అమలుపరచే విషయంలో అతడు అధికారము కలిగివుంటాడని చెబుతున్నాను బ్లాకు సమితి resolutions ను కార్యరూపము దాల్చుటకు పని చేయించే అధికారం Block సమితి అధ్యక్షునికి వుంది కాని discipline విషయంలో కాని, అతని personal conduct విషయములో కాని, అతనిconfidential reports వ్రాయడం విషయములో, కాని transfer విషయములో కాని promotion విషయంలో కాని బ్లాక్ సమితి అధ్యక్షునికి అధికారము వుండాలనే

ట్లయితే అది ఆలోచించవలసిన విషయము ఎందుచేతనంటే- అక్కడ complete autonomous structure ఐనప్పుడు జిల్లా అధికారులు ఏమి చేయాలనే విషయంవస్తుంది జిల్లా అధికారులకు వలం technical control మాత్రమే వుంటుంది Administrative control పోతుంది అక్కడ ఏలోపము జరిగినాకూడా శాసనసభలో ప్రధానంగా చెప్పాలనట్లయితే, ఆ బాధ్యతను ఎవరు వహించాలనే విషయంవస్తుంది Working లో interlocked administration వ్యవస్థను మనం సిద్ధపరుస్తున్నాము, parallel lines లోనా? Block సమితి సంపూర్ణంగా స్వేచ్ఛగావుంటే ఆ అధ్యక్షునకు సంపూర్ణమైన స్వేచ్ఛకలిగి Block వ్యవహారాలు వారే నిర్ణయించుకుంటే పైనవున్న officers కు సమితిపైన అధికారం లేకుండా వుంచేటట్లయితే Cabinet control ఎంతవరకు వుంటుంది, శాసనసభ యొక్క control ఎంతవరకు వుంటుందనే విషయం it is a matter on which a research has to be made తొందరపడి మనము అడుగువేయుచున్నాము ప్రభుత్వము వాటికి అధికారమివ్వడానికి వెనుకబడుతుందనుకోవద్దు సంపూర్ణ అధికారము Block సమితికి, జిల్లా పరిషత్తులకు యివ్వాలనే నిర్ణయం వున్నదని నేను మనవి చేస్తున్నాను ఆ అధికారము తీసుకవెళ్ళి ఎవరి చేతులలో పెట్టాలి? సమితి అన్నపుడు అది ఒక unified body సమితి పక్షాన ఎవరు వ్యవహరించాలి? ఈ కార్యక్రమములో ఏదైనా లోపము వస్తే ఎవరిని అడగాలి? ఈ కార్యక్రమము సక్రమంగా జరుగకపోయినట్లయితే రేపటి దినము శాసనసభలో ప్రశ్న వస్తే ఎవరిని అడుగాలి? ప్రభుత్వమునుంచి అడగాలంటే మేము ముందు కలక్టరును అడుగుతాము కలెక్టరు మాకు లోనై వున్నారు కాని అక్కడ ఎన్నికైన అధ్యక్షుడు ప్రభుత్వానికి లోనై వుండ నవసరంలేదు అలా వుండడము కూడా మంచిదికాదు అందుచేత Executive Officer ఎవరైతే వుంటారో వారు dual control లో వుంటారు అని నేను మనవిచేస్తున్నాను ఇపుడు Block Development Officer సమితి అధ్యక్షుని క్రింద పనిచేస్తుంటారు ఇక్కడ జిల్లా అధికారులక్రింద కూడ పనిచేయాలి ఈ dual control క్రింద అతడు పనిచేయవలసి వుంటుందని నా భావన పైనవున్న ప్రభుత్వానికి ఏ సంబంధంలేకుండా సంపూర్ణముగా Block సమితులు స్వేచ్ఛతో వ్యవహరించినట్లయితే యీ 447 republics ను మనము స్థాపించడానికి తీర్మానము చేసినవాండ్లమౌతాము Autonomy అనేమాట ఉపయోగిస్తాను ఈవేళ Constitution క్రింద Provincial autonomy మనకు వున్నప్పటికి కూడ మన Budget ను కేంద్ర ప్రభుత్వానికి పంపిస్తున్నాము ఎందుకంటే ఒక plan క్రింద పనిచేస్తున్నాము వారిదగ్గరనుంచి డబ్బు వస్తుంది వారి

దగ్గరనుంచి సాంకేతిక సహాయం వస్తుంది వారు పైన మేము క్రింద అనే భావముతో కాదు. అటువంటి పరస్పర సంబంధ మున్నట్లయితే తప్పులు తక్కువ జరుగుతవి సమిష్టి శక్తితో మనము ముందుకు పోగలుగుతాము అందుచేత యీ అధికారాలను మనము rigid గా compartmental system లో పెట్టేటట్లయితే దానివల్ల Plan లో ఏ కార్యక్రమమైతే controlled guidance and direction క్రింద జరుగవలసివుందో అది జరుగదని నా అభిప్రాయము లేదా శాసనసభ కనుక వ్యక్తులకు సంపూర్ణ అధికారమిచ్చి వారిపైన అధికారము జోక్యము వుండకూడదనే నిర్ణయానికి వస్తే అది వేరేవిషయము It is taking a risk There is an inherent right in the Plan—central direction, central guidance and the plan also demands a collective functioning ప్రభుత్వ రంగములో కానివ్వండి, ప్రజారంగములో కానివ్వండి collective functioning ఉండాలి అందుచేత ఇవన్నీకూడ తునకలుతునకలుగా చేసినట్లయితే ప్రమాదముంటుందనే నా అభిప్రాయము కాని సిద్ధాంతరీత్యా Block సమితి అధ్యక్షునికి Block Development Officer పైన ఏమాత్రము control వుండకూడదని నా ఉద్దేశం కాదు తప్పకుండా control వుండాలి సమితి అధ్యక్షుని క్రిందనే Block Development Officer పనిచేయాలి. కాని ఏ ఏ విషయాలలో ఆయన వ్యక్తిగతముగా సంబంధముకలిగివుంటాడు, ఏ విషయంలో సంబంధములేదు అనేది ఆలోచించాలి It is neither politics nor sentiment

జిల్లా కలెక్టరును Chairman గా పెట్టడమువల్ల యీ కార్యక్రమానికి లాభమని భావించబడినదే కాని మరేమికాదు కార్యక్రమాన్ని బాగుగా జరపడానికి జిల్లా అధికారులు అందరి co-operation బాగా సంపాదించడానికి జిల్లా కలెక్టర్ Chairman గా వుంచేనే బాగుంటుందని భావింపబడినది

పంచాయితీ సమితుల బడ్జెటు జిల్లా పరిషత్తులవద్దకు వస్తుంది జిల్లా పరిషత్తుల బడ్జెటు ప్రభుత్వమువద్దకు వస్తుంది ముఖ్యమైన విషయాలన్నీ మనవి చేశాను ఈ శాసనాన్ని మనదేశంలో అమలులోనికి తీసుకొనిరావడములో ఒక పెద్దపనిచేస్తున్నామనే భావిస్తున్నాను దీనిలోఅధికారులకుజోక్యము ఎంతవరకు ఇచ్చాము ఇంకాఇవ్వవలెనా, ఇవ్వకూడదా? అనే విషయములు Select Committee, Regional Committee stage లలో చర్చించడానికి అవకాశమువుంది అధికారము క్రింది స్థాయిలోనికి తీసుకొనివద్దామని ప్రజలకు ఆ కార్యక్రమాలతో ఎక్కువ సంబంధము కలుగచేయాలని మన అందరికీ వున్నది దీనిలో ఏమీ భేదాభిప్రాయము లేదు సభలోవున్న పార్టీల మధ్యకాని, పార్టీలోవున్న

వ్యక్తుల మధ్యగాని భేదాభిప్రాయాలువున్నా collective wisdom నుంచి వచ్చిన అభిప్రాయాలను తీసుకొని ఈ బిల్లును సవరించడానికి అవకాశముగా వుంటుందని మనవి చేస్తున్నాను ఈ అవకాశమును యిచ్చినందుకు ధన్యవాదాలు తెలుపుతూ విరమిస్తున్నాను

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, పంచాయితీ సమితులను, జిల్లాపరిషత్తులను Special Officers తోను nominated District Boards తోను పోల్చితే మాత్రం గుడ్డిలో మెల్ల అని చెప్పాలి అంతకన్న ఈ బిల్లులోవున్న గొప్పతనము ఏమీలేదు ప్రజలకువున్న అధికారాలను తీసివారేసి ఉద్యోగస్థుల పరిపాలనకు ఈ బిల్లు తోడ్పడుతుంది తప్పితే మంత్రిగారు ఒకగంటసేపు వివరించిన రీతిగా స్థానికస్వపరిపాలనకు ఇది ఎంతమాత్రము ఉపయోగపడదని చెప్పవలసి వస్తుంది ఈ nominated District Boards కన్న, ఈ జిల్లా పరిషత్తులు, పంచాయతీసమితులు మెరుగనే విషయం మీద చర్చించవలసిన అవసరం లేదు ప్రజాతంత్రముగా స్థానికపరిపాలన ఒక అడుగు ముందుకు వేస్తే ఎక్కడ కొంపమునిగిపోతుందో అని భయముతోను వెనుకకు పోకపోతే ప్రజలు ఏమనుకుంటారో అనే భయముతోను ముందుకు పోవడానికి, తయారు కావడములేదు ఉద్యోగస్థులనే ఠిన స్తంభాలను నిలబెట్టుకొనడానికే ఈ బిల్లు తోడ్పడుతున్నది పరిపాలనా వ్యవహారములో ఎన్ని దొంతరలు వున్నవో చూడండి ఇంకా కొన్ని ఎక్కువచేయుట తప్పితే వీటిని తగ్గించే ధోరణి ఏమీలేదు ఇపుడు ఈ పంచాయతీలు, తాలూకాఫీసులు, Revenue Divisions, Collectorates, Revenue Boards, Secretariat అని ఐదు దొంతరలు వున్నవి ఏ చిన్న సమస్యకు అయినా పంచాయతీదగ్గర ప్రారంభమై మంత్రి వద్దకు వచ్చేవరకు ఈ తతంగం అంతా నడుస్తూఉండవలసినదే ఈ దొంతరలు తగ్గించడానికి పూనుకొనడంలేదు తాలూకాకు పంచాయతీకిమధ్య పంచాయతీ సమితి అనేది ఒకటి వస్తోంది, కాని ఈ తాలూకాఫీసు లన్నిటినిఎత్తివేస్తున్నారా అంటే సగము ఎత్తివేస్తున్నారు, సగము ఎత్తివేయడము లేదు అభివృద్ధి కార్యక్రమాలన్నిటిని ఈ పంచాయితీ సమితులకు యిస్తున్నాముకదా ఇంక తాలూకాల ప్రసక్తి ఎక్కడ అని అడుగుతారు తహశీలుదారు పన్నులు వసూలు చేసుకొంటారు కలెక్టరుకు ఇదివరకు వున్న judicial powers అన్నిటిని Judicial Magistrates కు యిచ్చివేశాము. Collector పన్నులు వసూలుచేయడము, Law and Order కాపాడడము మాత్రమే అంటున్నారు తరువాత అంతమాత్రమే కాకుండా Development Commissioner గా కూడా చేస్తామని అన్నారు ఈ బిల్లు చూచినప్పుడు

జిల్లాపరిషత్తులకు పంచాయితీ సమితులకు యిచ్చిన హక్కులు బాగానేవున్నవి వ్యవసాయము, చదువు, వాణిజ్యము మొదలైనవాటన్నింటిని అభివృద్ధిచేయాలి అంటారు బాగానేవుంది కాని ఏ పని చేయాలన్నా కొంచెము స్థలము కావాలి రోడ్లువేయాలంటే డొంకలు కావాలికదా ఇండ్లుకట్టాలంటే స్థలాలు కావాలి కదా ఏ పనికైనా తహశీలుదారు దగ్గరనుంచి కలెక్టరువరకు వెళ్ళి వారు sanction చేస్తేగాని ఈ పంచాయితి సమితిగాని, జిల్లాపరిషత్తుగాని ఏమీచేయడానికి అధికారాలులేవు ద్వంద్వపరిపాలన తీసివేస్తామని చెపుతున్నారు కాని తీసివేయడము. లేదు పన్నులు వసూలుచేయడము, Law and Order maintain చేయడం ఈరెండు తప్ప collector కు మరొకపనిలేదు కాబట్టి వీటిని అతనికి అప్పగిస్తామంటున్నారు ఈ development కు సంబంధించిన ఏ హక్కు-అయినా తహశీలుదారుకుగాని, Revenue Divisional Officers కు గాని సంక్రమింపచేస్తున్నట్లు ఎక్కడా ఏ క్లాజూ లేదు అది చేయనంతకాలము వున్న దొంతరలను ఎక్కువచేయడము తప్పితే మరొకటిలేదు ఇన్ని దొంతరలు పెట్టుకొంటే వికేంద్రీకరణ ఏవిధంగా అవుతుంది? Efficiency కి దారి ఏది? ఈ మాటలకు అర్థము కనుపించడములేదు మనము పంచాయితీ చట్టము pass చేసి వున్నాము ఆంధ్రకు సంబంధించినంతవరకు రెండువేల జనాభాకు లోపల వున్నట్లయితే 2 మైళ్ళసమీపములోవున్న గ్రామాలను ఒక group గా చేసి పనిచేయించవచ్చు తాలూకాలుగాని, Revenue Divisions గాని లేకుండా యీ పంచాయితీ సమితులను, పరిషత్తులను ఎక్కువ చేయాలి ఇప్పుడు మనకు 20 జిల్లాలు వున్నవి 20 జిల్లాలతో ఇది సాధ్యముకాదు 50 జిల్లాలు చేయండి ఉన్న జిల్లాలను అల్లే వుంచి 20 మంది సభ్యులను 40 మందిని చేస్తామనేదానికన్న ఆ యా ప్రాంతాలను అభివృద్ధిచేయడమే ప్రధానాంశముగా వుందికాబట్టి దానికొరకు జిల్లాలను చిన్నవిగానే చేయండి చిన్న గ్రామాలను కొన్నిటిని కలిపి ఒక administrative unit గానో లేక ఒక development unit గానో తయారుచేయండి. 2, 3 గ్రామాలను కలిపి ఒక పంచాయితీని చేసి వాటిమీద ప్రభుత్వపు కంట్రోలు పెట్టండి ఈ రీతిగా వుంటే దొంతరలు లేకుండా వుండి సత్వరముగా పనులు సాగడానికి వీలవుతుంది పంచాయితీసమితి క్రింద 60 వేల జనాభా వుంటుంది క్రమేణా 20 వేలకు, తరువాత 10 వేలకు రాక తప్పదు ఇంకా జిల్లాలను ఎక్కువచేసి, ఈ దొంతరలను తగ్గించి, అభివృద్ధి కార్యక్రమాలను సత్వరముగా జరుపవలెనంటే తహశీలుదారుకు, R D O. లకు వున్న అధికారాలన్నింటిని సమితులకు ఇచ్చినపుడే సాధ్యమవుతుంది ప్రస్తుతము తహశీలుదారునుంచి కలెక్టరు వరకు పన్నులు వసూలుచేయడమే పని కావచ్చు

భవిష్యత్తులో పన్నులు వసూలుచేయు పని కూడ యీ పంచాయితీ సమితులకు ఇవ్వాలని నా అభిప్రాయం ఇప్పుడు ఈబిల్లు ద్వారా నిర్మాణం అయ్యే పంచాయితీ సమితులు ప్రజాతంత్రముగా ఉన్నవా లేవా అంటే, ఉన్న ప్రజాతంత్రానికి కూడ దెబ్బకొట్టేవిగాఉన్నట్లు మంత్రిగారికి చెప్పవలసివస్తోంది పంచాయితీ బోర్డుకు ఆదాయం తక్కువ ఉండవచ్చును ముఖ్యంగా మైనరు పంచాయితీ బోర్డు అధ్యక్షులు, ప్రభుత్వము ఏర్పాటుచేసిన నియమముల ననుసరించి వారికి ఉన్న హక్కులకు లోబడి, ఆదాయానికి లోబడి పంచాయితీబోర్డు నిర్ణయించిన పనులు అమలుజరపటానికి హక్కు ఉన్నది కాని రాబోయే నూతన పంచాయితీల పరిస్థితి ఏమిటి ? పంచాయితీబోర్డుల బడ్జెట్లు పంచాయితీ సమితికి submit చేయాలి వారి ఆమోదం లేనిదే ఖర్చుపెట్టుటకు వీలులేదు వారికి ఉన్న అధికారాన్ని యింకా సంకుచితం చేసి త్వరగా పనులు చేసుకొనుటకు వీలులేకుండా చేస్తున్నారు గ్రామ పంచాయితీలు తమ బడ్జెటులను submit చేసి ఆమోదం పొందాలంటే, మరింత ఎక్కువ ఆలస్యానికి, ఎక్కువ జోక్యం కలుగజేసుకొని పంచాయితీల హక్కులకు దెబ్బ కొట్టడానికి అవకాశం ఏర్పడుతోంది 50 పంచాయితీలనుంచి బడ్జెటులువస్తే, పంచాయితీ సమితి వాటిని ఎప్పటికి study చేసి, ఆమోదించి తిరిగి పంచాయితీలకుపంపుతుంది? ఉద్యోగుల యిష్టము వచ్చినట్లు చేయడమేనా ? 50 మందితో కూడుకొన్న పంచాయితీ సమితి కూర్చొని యీ బడ్జెటులనన్నీ చూస్తుందా ? లేక ఒక Finance Sub-Committee ని వేసి చూస్తారా ? అట్లాచూచినా 50 బడ్జెట్సు వస్తే ఒక్కొక్క బడ్జెటుకు మూడు నాలుగు రోజులు తీసుకున్నా సంవత్సరం వరకు పట్టుతుంది కాబట్టి యీ పద్ధతి చూస్తే పంచాయితీబోర్డులకు ఉన్న హక్కులను తగ్గించుతున్నట్లు కనబడుతోంది

*Sri V B. Raju* I think some authority has to approve the budget even now—Local Self-Government authority

శ్రీ పి సుందరయ్య ఒక ప్రక్క ప్రజలకు హక్కులు యిస్తున్నామని చెబుతూ యింకొకప్రక్క ప్రజలచేత ఎన్నుకొనబడిన పంచాయితీ సభ్యులు, అధ్యక్షులు చేసే నిర్ణయాలను, గవర్నమెంటు నామినేటెడ్ ఆఫీసరుకు తన యిష్టము వచ్చినట్లు చేసే అధికారము యివ్వడం —ప్రజాతంత్రానికి ఒక అంకుశంగాఉంది. ఇది తీసేస్తేనే నిజమైనప్రజాతంత్రంగాఉంటుంది మేజరు పంచాయితీలు, మ్యునిసిపాలిటీలు, కార్పొరేషన్సు— వీటన్నింటికి గవర్నమెంటు Executive officers ఉండి వారే all in all గా ఉంటారు ఏదైనా వారి యిష్టము లేకపోతే వాయిదా వేయటం జరుగుతుంది. అదే పరిస్థితి యీ

పంచాయితీ సమితులలోను, జిల్లా పరిషత్తులలోను తీసుకువస్తున్నారు ఒకపక్క ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రజలు కావాలంటూ, రెండోపక్క యీ ఆఫీసర్సును పెడుతున్నారు పంచాయితీ సమితి అధ్యక్షులు పంచాయితీ పనులు execute చేయడానికి అధికారంలేదు రెండవ schedule లో యిచ్చిన అధికారం ప్రకారం సమావేశాలకు అధ్యక్షత వహించడం, తిరగడం, అంతవరకే చేయగలిగేది వారితో Block Development Officers సంప్రదించవచ్చును అంతకంటే పంచాయితీ సమితి అధ్యక్షునకు ప్రత్యేక అధికారాలు ఏమీలేవు ఎన్నుకోబడిన పంచాయితీ సమితి అధ్యక్షుడు బ్లాక్ డెవలప్మెంటు ఆఫీసరు కన్న తక్కువ స్థాయిలో ఉంటున్నాడు బ్లాక్ డెవలప్మెంటు ఆఫీసరు— ఎగ్జిక్యూటివ్ హెడ్ ఆయన చేయగలిగిన పనులగురించి ఒక చేటభారతం వ్రాయడం జరిగింది ఈ ఆఫీసరు పంచాయితీ సమితి అధ్యక్షునకు టెక్నికల్‌గా సహాయంచేస్తూ ఒక సెక్రటరీగా ఉండి ఎందుకు పనిచేయకూడదు ? ఇక్కడ మంత్రివర్గం క్రింద వివిధ ప్రభుత్వ శాఖల సెక్రటరీలు, ఆఫీసర్సు పనిచేసినట్లు అక్కడకూడ ఎందుకు చేయకూడదు ? ఇక్కడ ఉన్న I C S Officers, మంత్రులు చెప్పినవి లక్ష్యపెట్టము, సెంట్రలు గవర్నమెంటువారి ఆర్డర్సు వచ్చేవరకు అమలుజరపము అని అంటే యీ రాష్ట్రి పరిపాలనకు ఏగతి పట్టుతుంది ? ఆ ప్రకారమే పంచాయితీ సమితి తీర్మానాలప్రకారం పనిచేయక ప్రభుత్వానికి refer చేస్తామనే అధికారం అక్కడి ప్రభుత్వ ఉద్యోగులకు యిస్తే ఎట్లా ఉంటుంది ? ఇది ప్రజాతంత్రముకాదు జిల్లా పరిషత్తుకు కలెక్టరును అధ్యక్షుడుగా ఎందుకుపెట్టారు ? జిల్లా పరిషత్తులో ఎన్నుకోబడిన అధ్యక్షులు వైస్-ఛైర్‌మన్ అన్నారు అతనే ఎందుకు అధ్యక్షుడు కాకూడదు ? మన శాసనసభ చేసిన చట్టాన్ననుసరించి ఉన్నహక్కులతో అధ్యక్షులు నిర్ణయించాలి. వారే అమలు జరపాలి కలెక్టర్సు, ఉద్యోగస్థులుకాదు ప్రజలచేత ఎన్నుకోబడిన పంచాయితీ సమితులక్రింద, జిల్లా పరిషత్తులక్రింద, అధ్యక్షులక్రింద పని చేయవలసిన ఉద్యోగస్థులు తప్ప నిర్ణయాలు తీసుకొనేహక్కు ఉండకూడదు ఎన్నిక అయి వచ్చినవారు చెప్పినట్లు ఆఫీసర్లు execute చేయాలి తప్పితే, ఆఫీసర్లు గవర్నమెంటుకు చెప్పుకొనేహక్కు లేకుండాచేయాలి ఆంధ్రరాష్ట్రి (మద్రాసు)డిస్ట్రిక్టుబోర్డ్సు చట్టంలోకూడ అధ్యక్షులకుఉన్న అధికారాలు ఏమిటి? అధ్యక్షులకు ఉన్న సర్వాధికారాలు execute చేయవచ్చు సక్రమంగా చేస్తున్నారా లేదా అనేది గవర్నమెంటు check-up చేసికొనడం general power of review క్రింద వస్తుంది Interfere కావాలంటే Cabinet level లో కావాలి కాని ఇప్పుడు సర్వాధికారాలు ఉద్యోగులకు యిస్తున్నామంటే అది ప్రజాతంత్రం కాదు Executive Heads గా పంచాయితీ సమితి

అధ్యక్షులు, జిల్లా పరిషత్తు అధ్యక్షులులే వుండాలి వారు చెప్పినట్లు ఉద్యోగస్థులు నడుచుకోవాలి సమితి అధ్యక్షులు చేసిన తీర్మానాలను పక్కన తొక్కి పెట్టి ఆఫీసర్ల యిష్టము వచ్చినట్లు చేయడానికి వీలులేదనే పెద్దమార్పు ఈ బిల్లులో తీసుకురావాలి

పంచాయితీబోర్డు బడ్జెటు పంచాయితీసమితి, పంచాయితీసమితి బడ్జెటు జిల్లాపరిషత్తు తనిఖీ చేయడం ఎందుకు ? ఇది అయ్యే పనేనా? వారి అంచనాలకు మించకుండా, ఆదాయానికి మించకుండా డబ్బు ఖర్చు పెట్టుకోవచ్చునసే అధికారం పంచాయితీలకు యివ్వాలిగాని వారిపైవారు అంగీకరిస్తేనేగాని ఖర్చు పెట్టటానికి వీలులేదనంటే ఇది వికేంద్రీకరణమునకు మార్గము తీసేది కాకుండా కేంద్రీకృతవిధానంలో నిరంకుశ ఉద్యోగులపరిపాలనకు దారితీస్తుందని స్పష్టముగా చెప్పవలసివస్తోంది ప్రజలచేత ఎన్నుకోనబడిన మంత్రుల పనులను విమర్శించే యీ రోజుల్లో, ప్రజలచేత ఎన్నుకోబడని ఉద్యోగస్థులకు ఎన్నుకోబడినవారు చేసేతీర్మానాలను రద్దుచేసేహక్కు యివ్వమని కోరడం 1959 సం లో — ఎల్లా ఉన్నదంటే పిల్లకు గంట కట్టుకొని ముందుకు పోతున్నామని అనుకొంటూ వెనక్కు నడుస్తున్నట్లు కనిపిస్తోంది తప్పితే యింకొకటి లేదని స్పష్టంగా, నిర్మొఖమాటంగా, ఖచ్చితంగా చెప్పవలసి వస్తోంది ఇటువంటి పంచాయితీ సమితుల, జిల్లా పరిషత్తుల నిర్మాణం ప్రజాతంత్రమా ? పంచాయితీబోర్డు అధ్యక్షులతో కలసి పంచాయితీ సమితి ఉంటుంది పంచాయితీ బోర్డులకు సంబంధించినంతవరకు రహస్య వోటింగు లేదు ఉద్యోగస్థుల ముందు బహిరంగంగా వచ్చి చెప్పాలి ఉద్యోగస్థులు తమ యిష్టం వచ్చినట్లు గుర్తుపెట్టడం, అనేక గొడవలు జరుగుతున్నాయి మన కాన్స్టిట్యూషన్‌లో చెప్పినట్లు బ్యాలట్ పెట్టెలద్వారా, సీక్రెట్ వోటింగ్ జరగాలని పెట్టాలి అంతేకాదు. Wards ఏర్పాటు చేస్తున్నాము, వాటిలో ఎవరైతే మెజారిటీతో వస్తారో వారే అధ్యక్షులుగా ఉండాలి గ్రామాలకు అది సరైన పద్ధతి కాదనేది వేరే సంగతి మా పార్టీసిద్ధాంతం ఏమంటే రాష్ట్రాల లోను, ఢిల్లీ పార్లమెంటుకు సంబంధించి దామాషా వోటింగు ఉండాలి. అన్ని పార్టీలు కలిసి దేశాన్ని ముందుకు తీసుకుపోవాలి భేదాభిప్రాయం ఉంటే దేశాన్ని ముందుకు తీసుకు పోవాలనే common point మీద దామాషా వోటింగ్ పద్ధతి ద్వారా జరగాలని మా అభిప్రాయము అన్నిపార్టీలతోకూడిన ప్రతినిధులతో పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్‌లు ఉన్నప్పుడే స్థానికస్వపరిపాలన సక్రమంగా జరగటానికి అవకాశం ఉంటుంది. అంతేగాని, మెజారిటీ పార్టీ అన్నింటిని నడపాలనే ధోరణితో పంచాయితీ సమితు

లను ఏర్పాటుచేస్తే అది వికేంద్రీకరణకాదు అది కేంద్రీకృత ఏకైకపార్టీ యొక్క పరిపాలనకు దారితీస్తుంది అని చెబుతున్నాను పంచాయితీ సమితి మెంబర్సుగా పంచాయితీ అధ్యక్షులు వస్తారు వాళ్ళు కలిసి మెజారిటీ వోటుతో స్టాండింగ్ కమిటీని ఎన్నుకొంటారు ప్రజలనుండి ఎన్నుకోబడినవారు ఒకరు వారు ఇంకొకరిని ఎన్నుకొంటారు వాళ్ళు తిరిగి మెజారిటీ వోటుతో యీ స్టాండింగ్ కమిటీ అధ్యక్షుని ఎన్నుకొంటారు ఇదంతా ఒక దొంతర అవుతుంది దీనినిబట్టి ఇప్పుడు మెజారిటీఉన్న పార్టీకి తప్ప, అన్ని పార్టీలకు ప్రాతినిధ్యం అందులో లభించదు ఆవిధంగా కాకుండా అందులో అన్ని పార్టీలకు ప్రాతినిధ్యం ఇచ్చినట్లయితే, ఒకరికొకరు తోడుగా--ఒకరిమీద ఒకరు చెక్ గాకూడ-- అక్కడి స్థానిక స్వపరిపాలనను నడుపుకొనే అవకాశం ఉంటుంది ఇటువంటి అవకాశం యీ బిల్లులో ఎక్కడా కల్పించబడలేదు మేము కోరే రెండో మార్పు ఏమిటంటే,— యీ పంచాయితీ సమితులకు మెంబర్సు, సరాసరి ప్రత్యక్ష ఎన్నికలలో ఓటర్సుచేత ఎన్నుకోబడాలి వయోజన వోటింగ్ పద్ధతి ప్రకారం, సీక్రెట్ బాలెట్ పద్ధతిననుసరించి యీ పంచాయితీ సమితి సభ్యులను ఆ పంచాయితీ సమితిలో ఉన్న ప్రజలు ఎన్నుకోవలసి ఉంటుంది దానికి మంత్రిగారు యీ ఎన్నికలవల్ల ఎక్కువ డబ్బు ఖర్చు అవుతుందని సమాధానం చెప్పవచ్చును ఎన్నికలకు డబ్బు ఖర్చవుతుంది అనుకొంటే, శాసనసభకు ఎన్నికలు జరిగినపుడే వీటికికూడ ఎన్నికలు జరుపవచ్చును అమెరికాలో అన్ని ఎన్నికలు ఒకేసారి జరుపుతారు ఆదేరకంగా ఇక్కడకూడ ఒకేసారి, అన్నింటికి ఎన్నికలు జరపవచ్చును అంతేగాని, "ఎన్నికలురద్దుచేసి, మేముఇన్ డైరక్ట్ ఎలక్షన్స్ పెడతాము"అని చెప్పటంవల్ల లాభంలేదు పంచాయితీసమితిలో పంచాయితీల అధ్యక్షులు మెంబర్సుగా ఉంటారు అంటున్నారు ఇదేమి ప్రజాతంత్రము? ఒక గ్రామంలో పదివేల జనాభా ఉంటుంది ఒక మునిసిపాలిటీలో 30 వేల జనాభా ఉంటుంది 5 వందలు జనాభావున్నగ్రామానికి ఒక అధ్యక్షుడు ఉంటాడు పది వేల జనాభా ఉన్న గ్రామానికి ఒక అధ్యక్షుడు ఉంటాడు 3, 4 వందల జనాభాగల గ్రామాలకుకూడ పంచాయితీ ఉండవచ్చు దానికికూడ ఒక అధ్యక్షుడు ఉంటాడు జనాభాదృష్ట్యా ఇంత తేడా ఉన్నప్పటికీ, ఆ గ్రామాలయొక్క పంచాయితీ అధ్యక్షులు ఆ పంచాయితీ సమితిలో మెంబర్సుగావుండి, పని చేయాలని చెప్పటం, ఇది వికేంద్రీకరణ కాదు ఇది ప్రజాతంత్రానికి నష్టము కలుగజేసేదనిమాత్రం స్పష్టము చేయవలసిఉన్నది ప్రతిగ్రామంలో జరపబోయే కార్యక్రమములు ఆ గ్రామంయొక్క బడ్జెటు శాంక్షన్ చేసే అన్ని అధికారాలను పంచాయితీ సమితికి ఇచ్చారు ఈ పద్ధతి ప్రజాతంత్రానికి నష్టము కలుగజేసేదిగా ఉన్నదని స్పష్టంచేస్తున్నాను. పంచాయితీ సమితులకు సరాసరి ఎన్ని

కలు పెడితే ప్రజలయొక్క అభిప్రాయం ప్రకారం సభ్యులు ఎన్నుకోబడే విలు ఉంటుంది లేదా దామాషా పద్ధతి ప్రకారం ఎన్నికలు జరిపితే అన్ని పార్టీలు యీ పంచాయితీసమితులలో ప్రాతినిధ్యం వహించే వీలుఉంటుంది ప్రజలందరూ కలిసి ఎన్నుకోవాలన్నది మా పాయింటు అన్ని పార్టీలవారు యీ సమితులలో వుండుటకు ఇంకొక ఎన్నికల పద్ధతి ఏదైనా ఉన్నదేమో ఆలోచించాలి కాని పంచాయితీ అధ్యక్షులతో ఉన్న పంచాయితీ సమితులు నిరుపయోగమని చెబుతున్నాను

తరువాత, అన్ని స్టాండింగ్ కమిటీలకు ఎక్స్ అఫిషియో ఉండటం దేనికి అన్ని స్టాండింగ్ కమిటీస్‌కు వేరే వేరే అధ్యక్షులు ఉండాలని మా ఉద్దేశము మెజారిటీ పార్టీ పరిపాలన కాకుండా, అన్నిపార్టీలవారు కలిసి స్థానిక వ్యవహారాలలో పనిచేయాలనే సూత్రము ప్రకారం యీ స్టాండింగ్ కమిటీ అధ్యక్షులు లందరూకలిసి పనిచేయాలి ఎగ్జిక్యూటివ్ హెడ్, బ్లాక్ డెవలెప్‌మెంట్ ఆఫీసర్ కాదు వీళ్ళు ఐదుగురు ఎగ్జిక్యూటివ్ హెడ్స్‌గా ఉండాలి వీళ్ళందరు ఒక కేబినెట్‌గా కలిసి పనిచేసేటట్లు చేయాలి పంచాయితీ సమితి సభ్యులు కేవలం మెజారిటీ వోటుతో కాకుండా, దామాషా వోటింగ్, సింగిల్ ట్రాన్స్‌ఫరబుల్ వోటు ప్రకారం యీ స్టాండింగ్ కమిటీస్, సబ్ కమిటీస్ ఎన్నుకొనే హక్కు ఉండాలి అప్పుడే అన్ని పార్టీలు కలిసి పనిచేయటానికి వీలుఉంటుంది అదే సూత్రం జిల్లా పరిషత్‌లకు కూడ వర్తింపజేయాలి జిల్లా పరిషత్‌లు, పంచాయితీ బోర్డు అధ్యక్షులు, యం ఎల్ ఏ లు, యం పి. లతో ఏర్పాటుచేయటానికి మేము సుతరామూ వ్యతిరేకము ఇదివరకు జిల్లా బోర్డులకు ఎన్నికలు జరిపిన విధంగా, జిల్లా పరిషత్‌లకు కూడా సరాసరి ఎన్నికలు జరపాలి అంతే గాని వడపోతవిధానం అనుసరించటం సరైనదికాదు పంచాయితీ అధ్యక్షులను ఉంచి, వారు ఎన్నుకొనే మనిషి ఉపాధ్యక్షుడుగా ఉంటాడని చెప్పినదానిని బట్టి చూస్తే, ప్రజాతంత్రం ఎక్కడ వచ్చిపడుతుందోననే భయంతో యీ వడపోత కార్యక్రమాన్ని తీసుకొన్నారని తెలుస్తుంది సాధ్యమైనంతవరకు అధికారంలో ఉన్న పార్టీతో జిల్లా పరిషత్‌లను నిర్మించుటకు, ఇతర పార్టీలకు అందులో స్థానం లేకుండా చేయుటకు ప్రయత్నిస్తున్నారనేది మనకు దీనివల్ల అర్థం అవుతున్నది ప్రభుత్వ ఉద్దేశం ఏమైనా, అమలులో మాత్రం అధికార పార్టీకి ఇందులో స్థానం ఉంటుంది మిగిలిన పార్టీలవారిని, యీ వడపోత కార్యక్రమంలో దశదశలవారిగా వదలివేయటం జరుగుతుంది. ఒక వడపోతలో అందరూ పోకపోతే, రెండవ వడపోతలో కొంతమంది పోయేదానికి, ఆఖరుకు వచ్చేటప్పటికి ఇతరపార్టీలవారెవరూ లేకుండా ఉండేదానికి యీ వడపోత

కార్యక్రమాన్ని యీ బిల్లులో పెట్టారు ఈ వడపోత కార్యక్రమానికి ఇన్‌డైరెక్ట్ ఎలక్షన్స్ తోడ్పడతాయి జిల్లా పరిషత్‌లు యీ రకంగా ఏర్పాటుచేసేదానికి మేము వ్యతిరేకము

"యం ఎల్ ఎ లు చాలా మంచివారు, వారు ఏ పార్టీకి చెందకూడదు, వారు బ్లాక్ సమితులకు సలహాలు చెప్పవచ్చు, కాని వారికి వోటింగ్ హక్కు లేదు" అనే పద్ధతి యీ బిల్లులో ప్రవేశపెట్టారు కాని మనం ఇక్కడ ఇచ్చే సలహాలకు ప్రభుత్వం ఎంత గౌరవం ఇస్తున్నదో మనమంతా చూస్తూనేఉన్నాం మొత్తం రాష్ట్రానికి సంబంధించిన పాలసీలు అక్కడ నిర్ణయించేదిలేదు ఇక్కడ మేము "మా ఊరికి స్మశానం లేదు, స్మశానానికి దారిలేదు, డొంక లేదు, మురుగుకాల్వ లేదు, స్మశానం కట్టించండి స్మశానానికి దారి ఇవ్వండి" అని ఇటువంటి చిన్న కోరికలు ప్రభుత్వాన్ని కోరతాము మేము ఇటువంటి చిన్నచిన్న కోరికలు కోరినా, వాటికి కూడ ప్రభుత్వం నిరాకరిస్తూ ఉంటుంది "మా హరిజనవాడకు స్మశానం లేదు, ఏమైనా కట్టిస్తారా ? వారికి నుయ్యి లేదు, కట్టిస్తారా ? యీ గొయ్యి ఉంది, కాస్త పూడ్పిస్తారా ?" అని మంత్రిగారిని అడిగితే, వాటిని చేయించటానికి వారికి సాధ్యంకాకుండా ఉంది ఇక్కడ ఇటువంటి చిన్నచిన్న కోరికలు అడిగినా, మంత్రిగారు తీర్చలేనపుడు, మేము, పంచాయితీ సమితులలో కూర్చుని ఏమి సలహాలు ఇవ్వాలి ?

ఇక రేపు ఏమైనా మేము అడిగితే మంత్రిగారు ఏమి చెబుతారంటే "ఇవన్నీ మాకు సంబంధించినవి కావండి అవన్ని పంచాయితీసమితికి సంబంధించినవి మేము యీ యాక్టుప్రకారం చేయగలిగింది ఏమీలేదు కాబట్టి మీరు మాదగ్గరకు రావద్దు" అని అంటారు అంటే, యం ఎల్ ఏలు మంత్రుల ఇళ్లదగ్గర పడిగాపులు కాయకుండా, బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్ చుట్టూ పడిగాపులు కాసుకొంటూ కూర్చోవాలన్నమాట ఎందుకంటే బి డి ఒ కు ఎగ్జిక్యూటివ్ పవర్ ఉంది యం ఎల్ ఏ లకు గల హక్కులు యీ విధంగా బిల్లులో పెట్టటం ప్రజాతంత్రాన్ని గౌరవించటం అవుతుందా? యం ఎల్ ఏ లకు ఓటింగ్ హక్కులేదని చెప్పటం వారిని అగౌరవపర్చటం అవుతుంది మంత్రిగారు ఏ పొరపాట్లు అయినా చేయవచ్చుగాని, అటువంటి పొరపాటు మాత్రం చేయకూడదు అవిధంగా చేస్తే, బ్రీచ్ ఆఫ్ ప్రివిలేజ్ క్రింద యీ హౌస్‌ముందుకు తీసుకు రావలసివస్తుంది (నవ్వు) కాబట్టి యం ఎల్ ఏలకు వోటుచేసే హక్కు ఇవ్వండి

అసలు, జిల్లా పరిషత్‌లకు ఇచ్చిన పనులు ఏమిటి? సెకండరీస్కూల్స్‌ను మెయిన్‌టెయిన్ చేసి నడపాలనేది స్పెసిఫిక్‌గా వాళ్లు చేయవలసిన పని,

పంచాయితీబోర్డులకు సంబంధించినంతవరకు, బ్లాక్ సమితికి సంబంధించినంతవరకు వారే పని చేసుకొంటారు రెండుమూడింటికి సంబంధించిన పని అయితే, అది జిల్లా పరిషత్ తీసుకొని చేయదు ఉద్యోగుల ద్వారా ఎగ్జిక్యూట్ చేయించాలి అప్పు, తమకు ఎగ్జిక్యూట్ చేసే అధికారం లేదు కేవలం ఎడ్వయిజరి బాడీస్‌గా పెట్టిన జిల్లాపరిషత్‌లలో మాత్రం యం ఎల్ ఏ లకు యం పి లకు స్థానం ఉన్నదట అందులో వాళ్లు ఓటు చేయవచ్చునట వాళ్ల సలహాలు పాటించ వలసిన బాధ్యత మంత్రివర్గానికిగాని, ప్రభుత్వానికి గాని లేదట

శ్రీ వి బి రాజు జిల్లా పరిషత్‌లో యం ఎల్ ఏ లకు ఓటింగ్ హక్కు ఉన్నది

శ్రీ పి సుందరయ్య ఇక్కడ శాసనసభలో మాకు మాట్లాడటానికి ఎంత హక్కు ఉంటుందో, అక్కడ మేము పాల్గొనే వోటింగ్‌కు అంతే హక్కు ఉంటుంది ఆవోటింగ్‌కు అంతే విలువ ఉంటుంది జిల్లా పరిషత్ చేసే తీర్మానం ప్రకారం ఏ పనీ జరగదు

పంచాయితీ సమితులకు, పంచాయితీ బోర్డులకు మనం ఇదివరకే చాల అధికారములను సంక్రమింపజేశాము ఇప్పుడు, 3, 4 పంచాయితీ సమితులను సంబంధించిన ఏ కార్యక్రమం అయినా తీసుకొని ఎగ్జిక్యూట్ చేయాలంటే ఆ సమితుల నిర్ణయాల ప్రకారమే జరుగుతుంది తప్ప సాధారణంగా ప్రభుత్వం ఏమీ చేయడానికి వీలులేదు పంచాయితీ పరిషత్తుకూడ సర్వాధికారాలు కలిగియుండదు శాసనసభ్యుల ఓటు యొక్క విలువ ఏమిటి అంటే కేవలం సలహాచెప్పడం మాత్రమే సలహా కమిటీలలో ఓటుహక్కుమీద పనిచేసేచోట, శాసనసభ్యులకు ఓటుహక్కు లేకుండ చేయడమంటే అది శాసనసభ్యులను గౌరవ పర్చినట్లా, మంత్రులను గౌరవపరుచుకొన్నట్లా ? ఈ పరిస్థితి ఏమిటో నాకు అర్థం కావడంలేదు ఈ అర్థంలేని క్లాజునుగురించి ప్రభుత్వం తీవ్రంగా ఆలోచించి తగు మార్పుచేయవలసినదని కోరుతున్నాను

ఉద్యోగులకు అయినా అన్ని అధికారాలు ఇస్తే ఏమవుతుందోనని ప్రభుత్వానికి భయంవేసింది ఉద్యోగస్తులుకూడ పంచాయితీ సమితులవలెనే ఎక్కడ చేసిపోతారో అని **supersede** చేసే అధికారం తమచేతిలో పెట్టుకున్నారు పంచాయితీ సమితులను, బోర్డులను ఎప్పుడుపడితే అప్పుడు సూపర్‌సీడ్ చేయడానికి ప్రభుత్వంచేతిలో అధికారం పెట్టుకున్నది యీ అధికారం ప్రభుత్వానికి ఎందుకువుండాలో నాకు అర్థంకావడంలేదు. పంచాయితీ బోర్డు అధ్యక్షులు

సరిగా పనిచేయకపోతే బోర్డుకు వ్రాసినట్లయితే, బోర్డులోని సభ్యులు, అందరూ కలిసి వారిని తొలగించడానికి హక్కువున్నది కదా విశ్వాసరాహిత్య తీర్మానం అనేదివుంటున్నది కదా ప్రజలచేత ఎన్నుకోబడినవారిని అంత ప్రత్యేక పరిస్థితి ఏర్పడితే సభ్యులే మెజారిటీతో తొలగించుతారు ఆంధ్రప్రాంతంలో దాదాపు 9 వేల పంచాయితీలు ఏర్పడినాయి తెలంగాణలోకూడ ఏర్పాటు చేయడం పూర్తిఅయితే మొత్తం అన్నీ కలిపి కనీసం 20 వేల పంచాయితీలు అవుతాయి ఈ 20 వేల పంచాయితీలపైనకూడ వాటిని అవసరమైనప్పుడు సూపర్‌సీడ్ చేయడానికి ప్రభుత్వానికి హక్కువున్నది అంటె, సంజీవయ్యగారుగాని, వి బి రాజుగారుగాని ప్రతిరోజు కాబినెట్‌లో కూర్చుని చర్చించుతారా? ప్లానింగ్ మినిష్టరుగా వి బి రాజుగారుగాని, లోకల్ అడ్మినిస్ట్రేషన్ మంత్రిగా సంజీవయ్యగారుగాని క్రిందనుంచి వచ్చిన ప్రతి ఫైలును చూచి సూపర్‌సీడ్ చేయమని ఆర్డరులు వేస్తారా ఇక్కడ మంత్రులైనా క్రింది అధికారులు వ్రాసినదానిని బట్టి సూపర్‌సెషన్‌కు ఆర్డరులు వేస్తారుగదా ఫైల్సు జాగ్రతగా చదివి చేయవలసిన వ్యవహారం ఇది అంతేకాని ఊరికే సంతకంచేసి పంపించండం అంటే కుదరదు ప్రజలచేత ఎన్నుకోబడిన వ్యవస్థల బ్రతుకు అంతా ఉద్యోగస్తుల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడివుండేరీతిగా చేయడం మంచిదికాదు అందువల్ల సూపర్‌సెషన్ చేసే అధికారం ప్రభుత్వానికి ఉండకూడదు జనరల్ రెవ్యూ చేసేటప్పుడు లోపాలు వున్నట్లయితే వాటిని ఆధారంగా తీసికొని చర్చ జరిపి పబ్లిక్ ఎంక్వయిరీచేసి ఆ లోపాలు చేసినవారిని తొలగించే అధికారం ప్రభుత్వం అట్టేబెట్టుకోవాలిగాని సూపర్ సెషన్ అధికారం ఉంచుకుంటేమాత్రం అది అధికారాన్ని దుర్వినియోగం చేయడమే అవుతుంది

ఉద్యోగస్తులమీద విశ్వాసరాహిత్య తీర్మానం పెట్టవలసివుంటే సగం మందికి పైగా నోటీసు ఇవ్వాలి అన్నారు అది పాస్ అవడానికి మాత్రం నూటికి 60 మంది ఓటు చెయ్యాలి అంటున్నారు ఎన్నుకోడానికి 51 మంది ఉంటే సరిపోతుంది తొలగించడానికి మాత్రం 60 మంది ఉండాలంటున్నారు ఇది ఎట్లా న్యాయిం అవుతుంది ? మొదట ఏదోవిధంగా ఎన్నుకోబడితే ఇక ఆ పీఠం అతనికే వుంటుందనేట్లుగా చేస్తున్నారు ఈ పద్ధతికి ప్రభుత్వంకూడ బలం ఇస్తున్నదన్నమాట అసెంబ్లీలోకూడ నూటికి 60 మందికాదు, 75 మంది ఓటుచేస్తేనెగాని మంత్రులను తొలగించడానికి వీలులేదనే విధంగా కాన్‌స్టిట్యూషన్‌లోకూడ మార్పుచేస్తే బాగుంటుంది అనే ఉద్దేశ్యం మంత్రులకు మనసులోవుండి యీ ప్రాతిపదికను ఇక్కడ పెట్టినారా ?

ఇక ఆడిటర్సు అంటే (ఎక్కడైనా డబ్బు దుర్వినియోగం అయితే ఆ విషయం పరిశీలించి ప్రభుత్వ దృష్టికి తెచ్చేవారు) ఇంతవరకు మేము అనుకుంటు

న్నాము కాని ఇప్పుడు ప్రభుత్వంవారు చెబుతున్న ఆడిటర్సు అటువంటివారు కాదు ఫలానా ఉద్యోగి డబ్బు దుర్వినియోగం చేసినాడు అని ఆడిటర్ గారు ప్రభుత్వానికి వ్రాస్తే ఆ పైన ఆ దుర్వినియోగంచేసిన సొమ్మును ఖచ్చితంగా వసూలుచేసే అధికారం ప్రభుత్వానికి ఉన్నది ఈ వాక్కు ఆడిటరులకు ఎందుకు ఇవ్వాలి ? ప్రభుత్వంచేత నామినేట్ చేయబడిన యీ ఉద్యోగులకు పంచాయితీ సమితి సభ్యులమీద, పంచాయితీ సమితులమీద, జిల్లా పరిషత్తులమీద డబ్బు వసూలుచేసే ఫైనల్ అథారిటీగా చేయడం అంటే అది ఏరీతిగా న్యాయం అవుతుంది ? ఏరతిగా ప్రజాతంత్ర పరిపాలన జరుగుతుంది ? డబ్బు దుర్వినియోగం జరిగితే దానిమీద ప్రభుత్వం చర్య తీసుకుంటుంది దుర్వినియోగం చేసినవారికి శిక్ష వేయవచ్చు డబ్బు రికవరీ చేయవచ్చు అంతేకాని ఆడిటర్సు రిపోర్టును ఆధారంచేసుకొని చేయడం ఎట్లా న్యాయం అవుతుంది ? పబ్లిక్ ఎంక్వయిరీ లేకుండా ఆడిటరులకే సర్వాధికారాలు ఇవ్వడమనేది సరైనదికాదని చెప్పవలసి వస్తున్నది

ఇక, సమితి సభ్యత్వం గురించి చెబుతున్నాను 6 నెలలు శిక్షపడినవారు యీ సమితిలో సభ్యుడుగా ఉండడానికి వీలులేదు అంటున్నారు ఇది పాత కాలపు బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కాలంలో దేశంకోసం పనిచేసినవారిని సభ్యులుగా రానీయకుండా పెట్టిన సూత్రం బ్రిటిష్ సామ్రాజ్యం అంతమైపోయి 11 సంవత్సరములైన తిరువాతకూడ అదే వాక్యాన్ని ప్రతి శాసనంలోను ఎందుకు పెడుతున్నారో నాకు అర్థం కావడంలేదు పంచాయితీబోర్డుల చట్టం లోను. డిస్ట్రిక్టు మునిసిపాలిటీస్ చట్టంలోను ఉన్నదికాబట్టి, ఇందులోకూడ పెట్టామంటే చెల్లదు ఆ చట్టాలు చాలాకాలం క్రిందట చేయబడినాయి

ఇప్పుడు ఆ సూత్రాన్ని మార్చుకోవలసిన సమయం వచ్చింది రెండేళ్ళు కఠినశిక్ష పడితేనే తప్ప నిలబడటానికి వీలులేదని రిప్రజెంటేషన్ ఆఫ్ పీపుల్స్ ఏక్టులో వున్నది ఇక్కడ అది అయినా పెట్టలేదు. నైతిక పతనం అయినట్లు నిదర్శనంగా, నేరాలలో శిక్షింపబడివున్నవారికి మాత్రమే వీటిలో నిలబడ డానికి హక్కు వుండరాదు కాని, 6 నెలలు శిక్షపడినంత మాత్రమున నిలబడ డానికి హక్కు లేదనడం పొరపాటు అవుతుంది ఇది కూడ ప్రజాతంత్రాన్ని దెబ్బకొట్టేదిగానే ఉన్నది

ఇక కో-ఆప్షన్ అనేది ఉన్నది పంచాయితీ బోర్డులలో స్త్రీలకు ఎక్కువ స్థానాలు ఉండకపోవచ్చు మన దేశంలో, షెడ్యూల్డ్ కాస్ట్స్. ట్రైబ్స్ వెనుక

బడి వున్నారు "స్త్రీలుకూడ పురుషులతో సమాన హక్కులు కలిగిఉండాలి అన్నప్పటికీ కూడ సమాజములో ఆచరణలోనికి రావడంలేదు అంటరానితనం పోగొట్టాలన్నా కూడ పోగొట్టలేకపోతున్నాము. కాబట్టి వీరందరికీ ప్రత్యేక సౌకర్యాలు ఇస్తేనేకాని వీలులేదు" అంటే ఒక స్థానం కాకపోతే, 3 స్థానాలు ఇచ్చుకోండి ఇక్కడ నామినేషన్ కాదు కో-ఆప్షన్ అంటున్నారు బాగానే వున్నది కాని, ప్రజారంగంలో బాగా పనిచేసినవారినుంచి ఇద్దరిని ఎన్నుకోవాలని చెప్పి, కో-ఆపరేటివ్ సొసైటీనుంచి డైరెక్టరుగా వున్నవారిని కో-ఆప్ట్ చేసుకోవాలి అన్నారు వారిని ప్రత్యేకంగా కో-ఆప్ట్ చేసుకోవలసిన పరిస్థితి ఏమి వచ్చింది? 50 మంది అక్కడవున్నప్పుడు ప్రజాతంత్రంలో పాల్గొన్నవారు సభ్యులుగా రాకుండా ప్రత్యేకంగా ఇద్దరు రావలసిన అవసరం ఏమివచ్చింది? సలహాలు మాత్రమే కావాలంటే సలహాలిచ్చేవారు చాలమంది ఉన్నారు ఎం ఎల్ ఎస్ సలహాలు తీసుకుంటున్నట్లే, కో-ఆపరేటివ్ బ్యాంకు డైరెక్టరుల సలహాలను కూడ తీసుకోవచ్చు అంతేగాని, వారిని కో-ఆప్ట్ చేసుకొని సభ్యులుగా పెట్టుకోవలసిన అవసరం ఏమాత్రం కూడ లేదు కాబట్టి యీ కో-ఆప్షన్ అనేది కూడ పోవలసివుంటుందని మనవిచేస్తున్నాను

ఈ బిల్లును మొదటినుంచి చివరవరకు పరిశీలించినట్లయితే వికేంద్రీకరణ పద్ధతి పోయి, కేంద్రీకరణ విధానంలో ఉద్యోగస్థుల పరిపాలనకు ఎక్కువ తోడ్పడుతున్నట్లు తెలుస్తుంది పంచాయతీ బోర్డులకు యీనాడున్న హక్కులను తగ్గించడం జరుగుతోంది సక్రమంగా పనిచేస్తున్న జిల్లాబోర్డులను కూడ తగ్గించి, కలెక్టరు పరిపాలనక్రిందకు తెచ్చి—కేవలం సలహాసంఘాలుగా చేయడం తప్ప మరొకటికాదు పరోక్షపు ఎన్నికలు పెట్టి ప్రజాతంత్ర విధానాన్ని ఏ మూల కూడ లేకుండ చేయడానికే యీ బిల్లు తోడ్పడుతోంది ఇటువంటి పరిస్థితులలో బ్రహ్మాండమైన అభివృద్ధి కార్యక్రమాలన్నీ అన్ని పార్టీలవారి సహకారంతో ప్రజాతంత్ర విధానంలో, ప్రజల అభిమతానికి అనుగుణంగా నడుస్తున్నదనే నమ్మకం మాకు లేదు యీ బిల్లును మళ్లా తగువిధంగా సంస్కరించాలి, లేకపోతే నిరుపయోగమైన బిల్లుగా ఉంటుంది

అధికారంలో వున్న పార్టీవారికే అనుకూలమైన పద్ధతిలో యీ బిల్లును తయారుచేసినట్లు కనబడుతున్నది మనదేశాన్ని, మన గ్రామసీమలను అభివృద్ధి చేయాలని, ఆ అభివృద్ధి కార్యక్రమాలలో అందరూ పాల్గొనాలని— సదుద్దేశములతోనే మంత్రిగారు ఈబిల్లును వికేంద్రీకరణకు ఉపయోగించేలా తెచ్చినామని చెబుతున్నారు ఆఉద్దేశాలతో మేమందరంకూడ ఏకీభవిస్తున్నాము కాని ఈ బిల్లు వల్ల ఆఉద్దేశాలు నెరవేరవు అందుకు యీ బిల్లు ఒక అడ్డంకిగా తయారవుతుంది

దీనివల్ల నామినేటెడ పంచాయితీ సమితులకు, బ్లాకు కౌన్సిల్సుకు దురవస్థ పడుతుంది అభివృద్ధికి ఏమాత్రంకూడ తోడ్పడదు సెల్ట్ కమిటీ స్థాయిలోను. రీజనల్ కమిటీ స్థాయిలోను యీ విషయాలన్నీ కూడ సరిగా ఆలోచించాలని కోరుతున్నాను

ఇంక ఒకటి రెండు విషయాలు చెప్పి నేను ముగిస్తాను ఆంధ్ర ప్రాంతములో కొద్ది భాగంలో తప్ప దక్కిన అన్నిచోట్ల పంచాయితీలు ఏర్పడ్డాయి ప్రభుత్వమే పరోక్ష ఎన్నిక పద్ధతి ప్రకారంగా పంచాయితీ సమితులను, జిల్లా పరిషత్తులను ఏర్పాటు చేస్తాం అంటున్నది ఫలానా తారీఖు లోపల యివన్నీ ఏర్పడతాయని యిదమిద్ధంగా ఒక తారీఖు నిర్ణయింపబడాలి "ఆ విధంగా తారీఖును చెప్పలేము, ఎన్నాళ్లు పడుతుందో చెప్పలేము" అనడం వలన లాభంలేదు 1958 సంవత్సరం నుండి జిల్లా బోర్డులు Special officers చేత పాలింప బడుతున్నవి ఇప్పుడు పరోక్ష పద్ధతిలో గుడ్డిలో మెల్ల అన్నట్లుగా యీ బిల్లు తీసుకొస్తున్నారు వీటన్నింటిని ఏర్పాటు చేయడానికి యింకొక పదేళ్లయినా తీసుకుంటారా? 'బ్లాక్సు అన్నీ ఏర్పడేదాకా పంచాయితీ సమితులు ఏర్పాటు చేయం' అనడం ఏమి న్యాయం? అంటే గుడ్డిలో మెల్లగానయినా అధికారపార్టీకి అనుకూలంగా వుండే నామమాత్రమైన సలహాసంఘాలు ఏర్పడడానికి కూడా 1965 వరకు పట్టే అవకాశం ముందన్నమాట బ్లాకు సమితులు ఏర్పడినా, ఏర్పాటు కాకపోయినా దానికి కేంద్రం కొంత డబ్బు యివ్వవలసి ఉంటుంది పంచాయితీలన్నింటినీ ఏర్పాటుచేసుకోవడం అంతా మన చేతిలోవుంది ఇదివరకు మంత్రిగారు 1959 జూన్ నెలాఖరులోపల తెలంగాణాలోకూడా వీటిని అమలు జరుపుతామని ప్రకటించారు ఒకవేళ జూన్ మాసాంతంలోపల బ్లాక్సు ఏర్పాటుచేస్తే వెనువెంటనే అన్నిప్రాంతాల్లోను పంచాయితి సమితులు ఏర్పాటు చేయవలసివుంటుంది ఆ తరువాత డబ్బు ఎక్కడవుంది ఖర్చు పెట్టడానికి?

ఈ నాడు బ్లాక్సు నిర్వహించే కార్యక్రమాలలో ఏవి ప్రజలను ఆకర్షిస్తున్నవి, అనే విషయం ఆలోచించవలసియున్నది ఆస్పత్రులు, ఇరిగేషన్ పనులు, స్కూళ్ళు ఏర్పాటుచేయడం మొదలైన విషయాలలో యీనాడు ప్రజలు ఆసక్తిచూపుతున్నంతగా మరో విషయంలో చూపడంలేదు 'వ్యవసాయాభివృద్ధికి కొత్త ఎరువులను ఉపయోగించాలి' అనేది ప్రచారంలో వుంటున్నది తప్పితే ఆచరణలోకి మాత్రం రావడంలేదు. Social education అనేది యీనాడు విద్యావిధానంలో ఒక భాగంగా రూపొందింది. వయోజనవిద్య Social education లో ఒకభాగము వీటి నిర్వహణకు ప్రత్యేకంగా తరిఫీదు

పొందినవారు అవసరంలేదు డిపార్టుమెంటులోనే కొంత staff వుంది ప్రతి బ్లాకులోను, పంచాయితీ ఏరియాలలోనుకూడా కొంత staff వుంది వారందరికి అదనంగా కొంత డబ్బుయిచ్చి ఈ కార్యక్రమాన్ని నిర్వహింపజేయవచ్చును. ఇదివరకు జిల్లాబోర్డులద్వారా చేసేపనే పంచాయితీబోర్డులుకూడ చేసేదానికి వీలువుంది అందువలన బ్లాక్సువచ్చేవరకు ఆగవలసిన అవసరంలేదు కేంద్ర ప్రభుత్వం రాష్ట్రంలోని అభివృద్ధి కార్యక్రమాలకొరకు కొంతడబ్బు యిస్తుంది ఆడబ్బు రావాలంటే రాష్ట్రంకూడా ముందుకొంత భరించవలసి ఉంటుంది అంతవరకు సవ్యంగానేఉంది ఇప్పుడు ఆయాబ్లాకు ఏరియాస్‌లో ప్రభుత్వం **Health, Irrigation works** మొదలైన వాటికొరకు కొంతడబ్బు **development** ద్వారా ఖర్చుపెడుతున్నది ఈ విధంగా ఖర్చుపెడుతున్న దానిలో కొంత తగ్గించి, **Government of India** నుండి వచ్చే **grant** మొత్తంకలిపి బ్లాక్సు ఏర్పడని ప్రాంతాలలో ఖర్చుపెడితే బాగుంటుంది అందువల్ల అన్నిప్రాంతాలూ సమానంగా అభివృద్ధి చెందడానికి వీలువుంటుంది అప్పుడే దేశాన్ని మనం ముందుకు తీసుకొనిపోగలం ఆవిధంగా కాకుండా '1965 వరకు ఆగండి, అన్నిప్రాంతాల్లో బ్లాక్సు ఏర్పడిన తరువాత సమితులు ఏర్పాటు చేస్తాం' అ భావ్యంకాదు **Agricultural experts, Industrial experts** మొదలైన వారందరిని పూర్తిగా వినియోగించుకొనే వరకు మనం యింకా రాలేదు "మాకు ఇప్పుడు కావలసింది- యీ గొయ్యి పూడ్చుకోడం, యీ నుయ్యి త్రవ్వుకోడం, రోడ్లను బాగుచేసుకోడం' అనే దృక్పథంలో ప్రజలు వున్నారు ఆ పనులకు ప్రభుత్వం కొంత సహాయంచేస్తే వారు ముందుకువచ్చి సహకరించి పంచాయితీబోర్డుల ద్వారాగాని, సమితులద్వారాగాని పనులు చేసుకొనడానికి అవకాశం కలుగుతుంది అంతేకాని పెద్ద ప్లాను పెట్టుకొని 1965 దాకా ఈ కార్యక్రమాలన్ని వెనకబడి ఉండాలనే వుద్దేశ్యం మంచిదికాదు వెనువెంటనే అన్నిప్రాంతాలలో పంచాయితీ సమితులను ఏర్పాటుచేయడానికి ప్రభుత్వం పూనుకోవాలి మేముకోరే ప్రజాతంత్ర పరిపాలనా విధానం ప్రకారంగా కాకపోయినా, అధికారపార్టీవారు అనుకున్న విధంగానైనా ఈ కార్యక్రమాన్ని వెంటనే ఆరంభిస్తారని ఆశిస్తున్నాను సెలక్టు కమిటీ, రిజియనల్ కమిటీ స్థాయిలో నా యీసూచనలను ఆమోదిస్తారని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను

శ్రీ పి నరసింహప్పారావు అధ్యక్షా, ప్రణాళికాశాఖా మంత్రిగారు పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్తులకు సంబంధించిన బిల్లును ప్రవేశపెట్టినారు ఈ బిల్లును బలపరుస్తూ కొన్ని ముఖ్యమైన విషయాలు వారి దృష్టికి తీసుకవస్తున్నాను

ఇదివరకు జిల్లా బోర్డులు వుండేవి, Local Boards వుండేవి వాటి పరిపాలనా విధానమంతా ప్రతినిధులు, కుంటీకిందా ఎన్నిపోతంగా వుండేది ఆ సమయంలో ప్రతివారికి జిల్లాబోర్డు ప్రెసిడెంటునుండి, మెంబరుదాకా అయ్యే అవకాశం వుండేది ఇక యిప్పుడు వాటిని మార్చి సమితులను తీసి కొచ్చి పెట్టారు ఏరోజునైతే యివి తీసుకొచ్చారో ఆనాడే ఒక్క పనులు జరగడం తప్ప తక్కినవన్నీ ప్రజల్లో ప్రవేశించాయి కొట్టుకున్నారు, దెబ్బలు తిన్నారు, చావడానికి సిద్ధమైనారు, కొంతమంది ఇంకా ఆస్పత్రుల్లోవున్నారు 'వీటిలో ఏదోవుంది' అనే అలజడి ప్రజల్లో తీసుకొచ్చారేతప్ప వీటివల్ల ప్రజలకు సదుపాయం ఏమాత్రంలేదని మనవిచేస్తున్నాను వీటివలన పార్టీతత్వాలు మరింత పెరుగుతున్నాయి ప్రభుత్వం మొదటిప్రణాళికా కాలంనుండి బ్లాక్సు ఏర్పాటుచేయడం ఆరంభించింది అవి ఎంతవరకు వాటికార్యక్రమాలను అమలు చేస్తున్నాయి? ఆయాబ్లాక్సులోని officers ఎంతవరకు క్రమంగాపనిచేస్తున్నారు? వారిక్రింద ఎంత ఖర్చు అవుతున్నది? ప్రజలకు ఎటువంటి సౌకర్యాలు కలుగ చేశారు? ఈవిషయములను యింతవరకు ప్రభుత్వం ఆలోచించిందా? ముఖ్యంగా staff ను పెంచుకుంటూ పోతున్నారు తప్ప పనిమాత్రం ఏమీజరగడం లేదని ప్రభుత్వ దృష్టికి తీసుక వస్తున్నాను Extension Officers, పంచాయితీ ఆఫీసర్సు, Co-opertive Officer ఈ విధంగా Staff ను పెంచుకుంటూ పోతున్నారు వీరేగాకుండా Social Education Officer గా ఒక స్త్రీ ని నియమించారు Election Officer ను పెట్టారు Auriculture Officer ను నియమించారు వీరంతా చేస్తున్నది ఏమిటి? Japan plantation అని తడలు, తాళ్లు పట్టుకొని వెళ్లడం, జీపుల్లో తిరగడం తప్ప వారుచేసే పనేమీ కనిపించడం లేదు ఈవిధంగా Block లో Staff కొరకు వేలాది రూపాయలు ఖర్చు అవుతున్నవి వీరుచేసే పనిమాత్రం ఏమీ కనిపించడంలేదు Face powders వేసికోవడం, జీప్సులో తిరగడం, వాళ్లు, వీళ్లు కూర్చోవడం కనిపిస్తోందికాని Irrigation లోకాని, roads కాని ఏమి అభివృద్ధి చేశారు. ప్రజలనుంచి ఎన్నో పన్నులు వసూలు చేస్తున్నారు, వారికి మీరు ఏమి చేశారని అడుగుతున్నాను

మిష్టర్ డిప్యూటీ స్పీకర్ ఉద్రేకంతో "మీరు, మీరు" అని అనకండి

శ్రీ పి నరసింహప్పారావు పూర్తిగా ఆలోచించి.ఎన్నికలు పెట్టి పూర్వపు జిల్లాబోర్డులపరిపాలన ఉంచితేనే మంచిది. లేకపోతే ఈ సమితులు పెట్టడంతో, దానిలో ఏదో ఉందని, దోచుకొని తిందామనే ఆశతో గ్రామాలలో పార్టీలు, కక్షలు ఎక్కువయిపోతున్నాయి, ప్రకాశం పంతులుగారు మద్రాసు ప్రభుత్వంలో ఉన్నప్పుడు Food Committeesను పెట్టారు దానిలో members,

presidents కావాలని తాపత్రయపడినట్లుగానే ఈనాడు ఈ పంచాయితీ సమితులలో members and presidents కావాలని తాపత్రయ పడుతున్నారు కానీ వీటిల్లో ఏమీ లేదు ఉన్న అధికారాలన్నీ తమ చేతుల్లోనే ఉంచుకొని, తమ ఉద్యోగస్థులనే అక్కడ వేశారు ప్రజలు శ్రమలోపడి ఉన్న డబ్బు, ఆస్తిని నాశనం చేసికోవడం, కొట్లాడుకోవడం తప్ప, వారు సమితుల లోకివస్తే, వచ్చే అధికారాలేమీలేవు 1933-34 వ సంవత్సరంనుంచి మేము జిల్లాబోర్డుల్లో ఉన్నాము రోడ్లను ఎంతవరకు అభివృద్ధి చేశాము ? అవన్నీ చెడిపోయి ఉన్నాయి వాటిని చూసే దిక్కూ, మొక్కూ లేదు Education side చేసింది ఏమీలేదు Hospitals ఉన్నాయంటే, మందులుకాని, డాక్టర్లుకాని లేరు ఇప్పుడు communications మాత్రం అక్కడక్కడ చేసినట్లు కనిపిస్తోంది ఈనాడు Block Develcpment Officers చేసే పని ఏమిటి ? రెండులక్షల ఎకరాలలో ఈ ఏడు జపాన్ వరిసాగు చేయాలని చెప్పడం, తాళ్ళుపట్టుకొని తిరగడం తప్ప, వారు చేసేపని ఏమిటి ? వీరుచేసే దానివల్ల పంట ఏమైనా అభివృద్ధి అవుతోందా అంటే, అది ఏమీలేదు ఈ సమితులు పూర్తిగా విఫలమైనాయి, వీటివల్ల ఏమీ ప్రయోజనంలేదు, కాబట్టి ఎన్నికలు పెట్టి, జిల్లాబోర్డులను నడపడం మంచిదని మనవిచేస్తున్నాను జిల్లా స్థాయిలో అధికారాలు ఇచ్చి, అక్కడవుండేవారిని పనిచెయ్యనివ్వండి

మిస్టర్ డిప్యూటీ స్పీకర్ మొదట్లో బిల్లును బలపరుస్తున్నామని చెప్పి, ఇప్పుడు ఈ విధంగా మాట్లాడుతున్నారు

శ్రీ పి నరసింహప్పారావు బిల్లును బలపరుస్తూ, కొన్నిసూచనలు చేస్తున్నాను ఇప్పటివరకు ఉన్న జిల్లాబోర్డులను తీసివేసి, వాటికి Special Officersను పెట్టారు. Special Officer's duties ను జిల్లా కలెక్టర్ చేయలేకపోతుంటే, వారికి P A లను వేశారు వారుకూడా ఈనాడు సవ్యంగా చేయలేకుండా ఉన్నారు మళ్ళీ ఈ సమితులద్వారా ఈనాడు కలెక్టరుకే ఆ అధికారాలన్నీ ఇస్తున్నారు అన్ని పనులు కలెక్టర్ ఎక్కడ చూసుకోగలడు ? అందుకోసం P A లను పెడుతున్నారు P A లు చూసే పని P A లాగే ఉంటుంది కాని, మరోవిధంగా ఉండదు దీనికోసం administrative officer ను వేసి, అన్ని అధికారాలు ఇచ్చి, పనిచేయనివ్వండి అలాకాకుండా మళ్లీ కలెక్టరునే వేస్తున్నామంటే అది చాలాపొరబాటు అని చెబుతున్నామ ఈనాడు ప్రభుత్వం తీసుకువస్తున్నవి 'సమితులు కావు, 'సవతులు'. దీనివల్ల ప్రతి ఊరిలోనూ పార్టీలు వచ్చాయి ప్రతి వ్యక్తి మధ్య, భార్యా, భర్తకు, తండ్రీ-కొడుకుకు మధ్య పార్టీలు వచ్చాయి

శ్రీ వి వి రాజు Democracy అంటేనే పార్టీలుంటాయి

శ్రీ పి నరసింహప్పారావు M L A లను ఇందులో పెట్టారు వారికి vote హక్కు కూడా లేదు ఎందుకు ఈ చలహాలు, సలహాసంఘాలు? ఇస్తే పూర్తి అధికారం ఇవ్వండి, లేకపోతే మానెయ్యండి ఈనాడు ప్రతి Block లో ఎంత Staff ఉంది వారు ఏమి పని చేస్తున్నారు? వారిక్రింద ఎంత ఖర్చవుతోంది? ముఖ్యమైన విషయాలన్నీ పరిశీలన చేయాలని కోరుతున్నాను ఏమి చెప్పినా figures చూపిస్తున్నారు ఇంత డబ్బు education కు ఖర్చుచేశామని చెబుతున్నారు. దానికోసం చేసిన పనేమిటి? Social education కొరకు ఒక female ను తీసుకువచ్చి Block లో పెట్టారు ఆమె ఎంతసేపూ జీపులోతిరగడం, B D O తో మాట్లాడడంతప్ప, ఎంతమందికి విద్యచెప్పింది? ఏమి చేస్తోందని చూస్తున్నారా? ఎంతజీతం ఇస్తున్నారు? ఆమె చేసినపని ఎంతో ఆలోచించారా ఎప్పుడైనా?

ఈనాటికీ కొన్ని గ్రామాలకు దార్లులేక మనుష్యుల రాకపోకలకే కష్టంగాఉంది ఏనాడయితే జిల్లాబోర్డులను "సూపర్‌సీడ్" చేశారో, ఆనాటి నుంచి జిల్లాబోర్డురోడ్లు అధోగతిపట్టి ఉన్నాయి జిల్లాబోర్డు స్కూళ్ళు అన్నీ అద్దె ఇండ్లలో ఉన్నాయి ఎక్కడో గొప్పో స్వంత buildings ఉంటే అవి కూడా ఈనాడు పతనావస్థలో ఉన్నాయి కాబట్టి ఈ roads, schools repairs అయ్యేటట్లు చూడండి అనవసరంగా staff ను పెంచి ప్రతినెల ఒకలక్షో, రెండులక్షలో ఖర్చుపెట్టే బదులు వీటి మరమ్మతుకు ఒక లక్షరూపాయలు ఇవ్వండి సరైనరోడ్లు లేక ప్రజలు ధాన్యంబస్తాలను బుజాలమీద తీసుకొని రావలసివస్తోంది గనుక రోడ్లు అభివృద్ధిచేయండి మొన్న వరదలువస్తే మా శ్రీకాకుళం కలెక్టర్‌తోటి మాట్లాడాలంటే telephone చెడిపోయింది వైజాగ్ జిల్లాకు అన్నిసౌకర్యాలు ఉన్నాయి మాకులేవు కాబట్టి communications, roads, schools బాగుచేయమని కోరుతున్నాను ఈ సమితులువచ్చి ఏమో చేస్తాయని ఆశలు పెట్టుకొని భ్రమపడవద్దని మనవి చేస్తున్నాను జిల్లాబోర్డులకు మళ్ళీ ఎన్నికలుపెట్టి, అన్నిఅధికారాలు వారికి ఇచ్చి, వాటిద్వారానే అన్ని పనులు సాగించాలని చెబుతూ నేను సెలవు తీసుకొంటున్నాను

శ్రీ పి గున్నయ్య అధ్యక్షా! ప్రజలకు అతిముఖ్యమైన ఈ పంచాయితీ సమితుల బిల్లును యింతత్వరగా తీసుకొని వచ్చినందుకు ప్రభుత్వానికి నా హృదయపూర్వక వందనాలు మనదేశ ప్రధానమంత్రి పూజ్యులైన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారు వేసిన ప్రణాళికలను ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రతినిధులద్వారా అమలుచేయించి, వారి జీవితస్థాయిని అభివృద్ధిపర్చడానికి ఈ

బిల్లు ఎంతో దోహదం చేస్తుంది ప్రజాభిప్రాయం తెలుసుకోవడానికి-ప్రజా ప్రతినిధులమైన మాముందు- ఈ బిల్లును ప్రవేశపెట్టారు ఇది చాలా ముఖ్యమైన బిల్లు కాబట్టి సభ్యుల అభిప్రాయాలు తెలుసుకోవడానికి 2, 3 రోజుల time ఇవ్వాలని కోరుతున్నాను మంత్రిగారు 447 (బ్లాకులను) సమితులను ఏర్పాటు చేస్తున్నట్లు చెప్పారు అధికారాలను వేరుగా సమితుల సభ్యులకు, అధ్యక్షులకు ఇవ్వడమా ? లేక కలెక్టర్లకే ఇవ్వడమా అనేవిషయం మంత్రిగారు సెలవిచ్చారు ఇదివరలో జిల్లాబోర్డుల పరిపాలనలో అధికారాలన్నీ వారికే ఇచ్చారు, ఇప్పుడు Special Officers చేతుల్లో పెట్టారు

జిల్లా బోర్డులకు ప్రెసిడెంట్లు ఉండేటప్పుడు, చాలా పనులు జరిగాయి పాఠశాలలు రోడ్లు మొదలైన అనేకపనులు అధ్యక్షులకాలంలో చేస్తూ ఉండే వారు, ప్రజలకు సదుపాయాలుచేయుటలో వారు శ్రద్ధవహించారు అదేవిధంగా ఈ సమితిఅధ్యక్షులు, ఎవరైనా ఒక ఉద్యోగి పొరపాటుచేస్తున్నట్లయితే ఆతనిని సస్పెండు చేయడంగాని, లేక ట్రాన్సఫరు చేయడంగాని మొదలైన అధికారాలు కలిగిఉండాలి అంతేగాక సమితి అధ్యక్షులు ఒక తీర్మానాన్ని ఆమోదింపజేసి, పంపినట్లయితే దానిని తప్పకుండా అమలుజరిపేటట్లు అధికార్లు చూడాలి బి డి ఓ లుగాని, యింకెవరుగాని దానిని త్రోసివేయకుండా తగిన కట్టుదిట్టము చేయాలి ఎందుకంటే ఒక్కొక్క సమితిలో 70 గ్రామాల పంచాయితీ అధ్యక్షులు ఉంటారు ఆ గ్రామాలకు సంబంధించిన, అన్ని కులాలవారి మంచి, చెడ్డలు వారు విచారిస్తారు మనం యిక్కడ నాలుగువందల గ్రామాల తరఫున ఎట్లా ప్రాతినిధ్యంవహిస్తున్నామో, అలాగే వారు 60, 70 గ్రామాల ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తారు అందుచేత సమితి చేసిన తీర్మానాలకు గౌరవం యివ్వాలని మనవిచేస్తున్నాను.

మిస్టర్ డిప్యూటీ స్పీకర్ ఆర్డర్, ఆర్డర్ .

శ్రీమతి టి లక్ష్మీకాంతమ్మ అధ్యక్షా, ఈ బిల్లు చాల ముఖ్యమైనది సభ్యులు ఇంకా చాలమంది మాట్లాడేవారు ఉన్నారు ఒకరోజే కేటాయిస్తే సరిపోదు దానికి సంబంధించిన మంత్రిగారు, ప్రతిపక్షనాయకులు సగం టైము తీసుకొన్నట్లయితే సభ్యులకు పూర్తిగా అవకాశం దొరకదు అందుచేత దాని మీద చర్చించుటకు 1,2 రోజులైన కేటాయిస్తే బాగుంటుందని నా ఉద్దేశ్యము

మిస్టర్ డిప్యూటీ స్పీకర్ దాని విషయమై ఆలోచించబడును Now the house is adjourned to tomorrow, 9 A M

*The House then adjourned to meet again at 9 a m Wednesday, the 10th December, 1958*